శ్రీరస్తు

# వేణీసంహారము

గ్రంథకర్త.


కొడాలి సత్యనారాయణరావు



ప్రచురణకర్త.

గొల్లపూడి వీరాస్వామి

శ్రీసీతారామా బుక్కుడిపో,

రాజమండ్రి.

మొదటికూర్పు.

కాకినాడ

స్కేప్ అండు కో., లో, క. సుబ్బారాయసోదరులచే

ముద్రింపఁబడియె.

1926.




[రు 1-0-0

# కృతిసమర్పణము.



నేనీకృతిని శాసననిర్మాణసభ్యులును, మదరాసుపురపాలకసంఘాధ్యక్షులును, ఆంధ్రభాషాభిమానులును నగు శ్రీయుత సామి వేంకటాచలంసెట్టిగారికి (వారి యనుమతి లేకుండఁగనే) వారిభూతదయకును, దేశసేవాపరాయణత్వమునకును, సరళస్వభావమునకును శాశ్వతస్మరణచిహ్నముగ సమర్పించుకొనుచున్నాఁడను.

ఇట్లు

కొడాలి సత్యనారాయణరావు.



# ఉపోద్ఘాతము



పాఠకమహాశయులారా! ఇది నాపదమూడవనాటకము. గడ్డములు మీసములిప్పుడు నెరసినపండితులయావనదశయందే తమ పాండిత్యప్రభావముచేత భట్టనారాయణకవికృత మగు నీవేణీసంహారముయొక్క రసమును బీల్చి మాకిమియు భాగమీయుచుండిరి. మేము పిదపకాలపుకవులము గనుక వారిభాగముకొఱకు మేము విచారపడుటకంటె వారివిరచితములగు గ్రంథములసారమును మేముపీల్చెదము. అప్పుడువారియెడల మాకుఁగల గురుభావము వెల్లడియై యేదోయొక నీతి నాధారపరచుకొని పామరజనంబునకు హితంబుఁ గఱపుకొఱకే యీకథనుమఱల నీరూపకముగ నాంధ్రులహస్తంబున నలంకరించితిమి గాని వేఱుద్దేశ్యము లేదని స్పష్టపడఁగలదు. భారతకథలలో నాటకము వ్రాయుటకిది తొలిసారి. కాన నావ్రాతలలోఁ దలక్రిందులు గావచ్చును. ఒకరు వ్రాసినదానిని మఱలవ్రాయుట లోకవిరుద్ధముగాఁ గాన్పించినను శైలియందుననో, కథయందుననో నూతనవిశేషములు కొన్ని కాన్పడుచునేయుండును. పరపడి వ్రాసిననేగాని అక్షరములు పోలిక కుమరదు. అది కుదిరినవెంటనే గాని స్వతంత్రశక్తి యలవడదు. కాన నేనీగాథ రచించుటలోఁ గొన్నితావులందు స్వతంత్రించినను యిదివఱకీగాథను రచించిన మహామహుల పాదచ్ఛాయలనే నేనుగూడ అంతటి ఇచి వారియందు గురుత్వమును నిల్పుకొంటినని దెలుపుకొనుట డమని పాంచా

కెంతయు సంతసించుచున్నాఁడ. మఱియొకవిషయము నున్నటి శ్రీరామనవమియుత్సవములం దూరుపేరులేని యొకనాటకసామాజికులు మద్విరచిత స్వతంత్రనాటకమును రాజమహేంద్రవరమునఁ బ్రదర్శించి యపకీర్తికిఁ బాలగుటయేగాక నా నాటకమునకును గొంత కళంకమాపాదించిరి. నాప్రారబ్ధవశమున నానేత్రములతో నది చూచుటయు సంభవించి నాయనుమతిఁబొందనివారు నానాటకముల నెంతమాత్రము ప్రదర్శింప వీలులేదని కట్టికట్టుదిట్టములతో మనవిఁ జేయుచున్నాఁడను. ఈనాటకమును వ్రాయుటయం దతిప్రోత్సాహమొసంగి త్వరితకాలములో మీాహస్తములందలంకరింపఁజేసిన గొల్లపూడి వీరాస్వామిబ్రదర్సు వారికి నెంతయుఁ గృతజ్ఞుఁడనని విన్నవించి యింతటితో విరమించు

నాంధ్రభాషాసేవక వర్గదాసుఁడు.

మకాం కొవ్వూరు
ది 24—7—26

గ్రంథకర్త.





—శ్రీకృష్ణాయనమః—

# వేణీసంహారము.

## ప్రథమాంకము.

):o:(

ప్రవేశము భీముఁడు—

[స్వగతము] ఆహా! కాలగతి యెట్లులున్నయది?

గీ. కట్టి నీటను ద్రోసిన యట్టివారి
నన్నమున విసముఁ బెట్టిన యట్టివారి
నహులతోడను గఱపించి నట్టివారి
వాలిచీరల నొలిపించి నట్టివారి
నఖిలమును ద్యూతమున దోచి నట్టివారి
నర్థరాత్రి యిల్లును గాల్చి నట్టివారిఁ
బట్టివధియింపలేక నీ వరుస సంధి
యత్నములఁ జేయుచుండె మా యన్నగారు.

అంతటి కొల్వులో నామూఢదుర్యోధనుఁడు తనతొడపైనిఁ గూర్చుం
డమని పాంచాలికిఁ గనుసన్నఁ జేసెనే? అగ్నిసాక్షిగఁ గైకొన్న యిల్లాలి

నంత పలుకుఁ బలికిన యీనటిని యీగదాదండమునకు బలిగ నొసంగ నాజ్ఞ నీయవలయును గాని సంధియా ! అవును. కాదా మఱి!

గీ. ద్యూతమున సర్వసంబును దోఁచిపెట్టఁ
బాచికల నప్పుచేతితోఁ బట్టినాఁడొ
అపుడె క్షాత్రంబు నశియించె నంతకన్న !
ధర్మరాజున కన్యథా దారికలదె!

ఇట్టి యప్రాచ్యపుసంధి కొడంబడుటకంటె మరణమే శ్రేయముగదా? ఎప్పుడును శాంతమో శాంతమో యని కలవరించు నీధర్మనందనుని ముందు మాప్రతాపమేవిధి నక్కఱకు రాఁగలదు ! ఓగదాదండమా!

మ. కురువంశమ్మును గూల్చి సంతసము నీ కున్ గూర్తు నేనంచు సం
బరమున్ జెందుచు నుంటివే మొ? యిఁకనా భాగ్యంబు లేదమ్మ నీ
కరుణాపాత్రుఁడనై జగాన మెలఁగం గాఁ జాల నీ యన్నముం
దరనా బాహుబలంబు వ్యర్థమగుచుండెన్ గాలకర్మంబునన్.

ఛీ ! ఛీ ! ఏమి నావెడఁగుమాటలు? ఈధర్మనందనునివాక్యములకు నేనేల బద్ధుఁడను గావలయును ? కాన నేనిప్పుడే నాసహోదరుల నుండి వేఱువడి మదీయప్రతిజ్ఞాపాలనంబునకై పోయెదఁగాక (అని సగర్వముగా నడచుచున్నాఁడు)

సహ—(ప్రవేశించి) అన్నగారూ ! ఎచ్చటి కాప్రయాణము?

భీము—ఎవరువారు ? (తిరిగిచూచి) తెలిసినది. ఓహో ! మీరా ?

గీ. శాత్రవుల గెల్వఁజాలక సంధిసంధి
యనుచునున్ బల్కరించియో ? హరినిరాయ
బారిగాఁ బంపినట్టిదో స్వారులైన
వారలా ? ఏనమీతోడఁ బనియె లేదు.

అని మఱల నడచుచున్నాఁడు)

సహ — అన్నా! వృకోదరా! సర్వమెఱింగిన మీరే యిట్టి నిష్ఠురోక్తులాడుచు మావంకఁ జూడకుంట పాడియా?

భీము — ఈభీమునితోడ మీకుఁ బనియే లేనపుడు మావంకఁ జూచుటని వీని కేల. కాన నో సహదేవా?

సీ. శాంతమో శాంతమో యని స్వస్తిఁ జెప్పు
కొనుచుఁ దిరిగెడి ధర్మజు వెనుకఁ జేరి
తాళముల వేసికొంచు శాత్రవులొసంగు
బిచ్చమునుఁ దించుజీవింప వెడలుమయ్య.

సహ — అన్నా! శాత్రవులు సంధికిష్టపడరని యెఱింగియే యన్నగారు శ్రీకృష్ణునిఁ బంపిరి. పర్యవసానమును వినకయే మనమేల తొందరఁ జెందవలయును?

భీము — శాత్రవులట్టు సంధికొప్పుకొనరని యెఱింగియుండియు ధర్మనందనున కీ పిచ్చియేల?

సహ — ఏలననియా మీ ప్రశ్న? కౌరవు లంతలేసి కష్టములఁ బెట్టినను పాండవు లోర్పుఁగలవారు. సంధిఁ జేసికొని లోక శాంతినిఁ గలుఁగఁ జేసిరని యెల్లవారును సంతసింతురు. వారు సంధి కంగీకరింపకున్నను పాండవులు శాత్రవుల దుర్ణయంబుల నడఁగఁ ద్రొక్కి శాంతి నొడఁగూర్చిరందురు. ఎట్లయినను మన మంచితనము లోకమునకుఁ బ్రకటితమగుటయే కావలసినదని ధర్మనందనుని యభిప్రాయము?

భీము — ఏమని సంధి?

సహ — ఐదూళ్లిచ్చి మిగతసంతయు నేలుకొమ్మని!

భీము — (వెడ మొగముఁ బెట్టి) ఛీ! ఛీ! ఈమాట నీవనను లేదు. నేను వినను లేదు. పొమ్ము. పొమ్ము. నాయూరుగూడ నీవే తీసికొని బిచ్చమెత్తుకొని జీవింపుము. పొమ్ము. నేనాయుధాగారమునకుఁ బోయి వలసిన యాయుధంబులఁ గైకొని సాధనల నేను గావించుకొని యుందును.

సహ—ఆయుధాగారమునకే యైనచో నిటుగోరెదరేమి?

భీము—మఱి యెవ్వరితో మాటాడవలసియున్నది? ఎచ్చటకుఁ బోవుదు?

సహ—పాంచాలీచతుశ్శాలాభవనమునకుఁ బోవుదు.

భీము—అటులైనను మంచిదియే. పాంచాలితో మాటాడవలసియున్నది. (అని పోవుచు) సహదేవా! ఇటురమ్ము

సహ—చిత్తము. ఆజ్ఞ!

భీము—సహజదారిద్ర్యవంతులమై యుండియు నా కౌరవుల కౄరచేష్టలను భరించుచు మన యన్నగారిమూలమున నెట్టి యవస్థలనందుచుంటిమో చూచితివా?

సహ—అన్నగారూ! కష్టము లెల్లకాలమును గాపురముఁ జేయునవి కావుగదా?

భీము—అట్లని కౌరవులతో సంధి చేసికొనుటయే యుత్తమమా?

సహ—ఆమాట నేననఁగలనా?

భీము—సహదేవా!

గీ, కౌరవులలో నాఁడు యింతిని కొప్పుబట్టి!
యీడ్చి చీరలనొల్చిన హీనచరితుఁ
బట్టి చీల్చవలదె? తొడ పైనిగూరు
చుండఁ గనుసన్నఁజేసిన దుండగీని.
కూల్చి ముదముఁ బాంచాలికిఁ గూర్పవలదె?

సహ—నిజమే. ద్రౌపదీసతికిఁ గలిగిన పరాభవమునకుఁ బ్రతిక్రియనొనర్పఁగలిగిన సమర్థులు మీరు. కాని యన్నగారి—

భీము—(అర్థోక్తిలో) ఆమాటయే నేననవలదని యున్నది.

(అంతఁ బాంచాలియుఁ జేటియుఁ బ్రవేశము)

చేటి—నీదుఃఖము నపనయించు భీమసేనమహారాజుగారుండిరి గాదఁటమ్మా ?

ద్రౌప—చేటీ ! భీమసేనకుమారుని ప్రతిజ్ఞలకు ధర్మనందనుని యడ్డంకులు లేకుండు నప్పుడుగదా ? నాదుఃఖము తీఱుట. అటులజరుగుటయు నాకష్టము లీడేఱుటయును దుస్తరముగనే యున్నది. కాని చేటీ ! నామన నంతయుఁగలతవాఱియున్నది. మన్మాథుఁడు వసించుతావునకుఁ గొనిపోమ్మ?

చేటి—దేవీ ! ఇదియే త్రోవ. నెమ్మదిగా నడువుము. తొట్రుపాటుఁ జెందకుము. (కొంచెము దూరము నడిపించి) అమ్మా ! భీమసేన కుమారుఁడిందే యున్నవాఁడు.

ద్రౌప—చేటీ ! అట్లయినచో ముందుగా నారాకనాథుని కెఱిఁగింపుము.

చేటి—అమ్మా ! తమరు కోపింపకున్న నే నొక్క సంగతిఁ దెల్పెదను.

ద్రౌప—అది యేమి ?

చేటి—దేవీ ! యువరాజుగారలకో అగ్రహాయత్తచిత్తులై యున్నట్లు తోఁచుచున్నది. కొంచెము తడవాగిన బాగుండునేమో?

ద్రౌప—చేటీ ! నీయూహాసరియైనదే. అట్లయినచో మనమిక్కడనే కూర్చుండి యువరాజాగ్రహ కారణమును గ్రహింతము.

చేటి—మంచిదమ్మా! కూర్చుందము.

(యిరువురును గూర్చుందురు.)

భీము—సహదేవా ! అదేమో కాని!

సీ. సతిని సదిమందిలోనఁ ఙ చముగఁ జూచి
యంతటి యకార్యములఁ జేసి ఙ నట్టివారి

# వే ణీ సం హా ర ము.

రూపుమాపెడి దాక నీ కోపవహ్ని
చల్లపడదయ్యో నే నేమి సలుపువాఁడ.

తమ్ముఁడా! వేపలుకులేల? నా నిశ్చితాభిప్రాయ మెఱిఁగింతు వినుము.

గీ. ఊళ్లైదింటిఁ గైకొని యుద్ధమునకు
విముఖుఁడై యున్నచో ధర్మ విభుని నేను
లక్ష్యపెట్టక గదనుఁ గేలన్ ధరించి
ప్రతిన నెఱవేర్చుకొనియెడి వాఁడ నేను.

ద్రౌప — చేటీ! ప్రాణేశ్వరుఁ డనినమాట మఱల నింకొక్క తూరి నా చెవులఁబడిన బాగుండునుగదా?

భీము — సహదేవా! వింటివా? తలవంచుకొంటివేమి? వినుము. మఱల వినుము.

గీ. ఊళ్లైదింటిఁ గైకొని యుద్ధమునకు
విముఖుఁడై యున్నచో ధర్మ విభుని నేను
లక్ష్యపెట్టక గదనుఁ గేలన్ ధరించి
బ్రతిన నెఱవేర్చుకొనియెడి వాఁడ నేను.

ద్రౌప — చేటీ! అంతటి యదృష్టముఁ బట్టునే? ఆశ్రీహరిసహాయముచే సంధిచెడిపోయి యుద్ధమే పొసఁగి కురుకులక్షయమందిన నాఁడు గదా సంతోషించవలయును?

చేటి — దేవీ! మీకోరిక యేల సిద్ధింపకుండును? యువరాజుగారు సంధికి విముఖులై యుండిరని మీకు వెల్లడి యగుచునే యున్నది గదా?

ద్రౌప — చేటీ! మనమింకఁ బ్రాణేశ్వరుని సమీపించెదమా?

చేటి — అమ్మా! రమ్ము! — (సమీపింతురు).

చేటి — జయము, జయము. మహారాజా!

భీము—సహదేవా ! ఏమినిరుత్తరుఁడ వైతివి? నాపలుకులునీకు రుచించలేదు కాఁబోలు ! ఏలరుచించును ?

గీ. సతిని కొప్పుఁబట్టి సభలోన నీడ్చిన
చెనఁటిఁ జూచినప్పుడె సిగ్గులేని
యట్టి మీకు నిప్పుడె దాడిన నాపల్కు
లెటురుచించు శిర్ష మెత్తుటెట్లు.

కాన నోసహదేవా ! మీరుండవలసినవిధాన మీవలనకే యుపదేశింపఁ బడినది.

ద్రౌప—(తనలో) నాధా ! బాగుగాఁ బలికితివి. ఈదీనురాలి పరాభవమార్పనీవే సమర్థుఁడవుసుమా?—

భీము—తమ్ముఁడా ! నాచిత్తమంతయు రణభూమిపై నున్నది. పాంచాలితో మాటలాడి పోవలయుననుకున్న నాదేవి యేలకో జాగొ నరించుచున్నయది.

సహ—(అటునిటుఁ జూచి) అన్నయ్యా ! ఆమెయే పాంచాలి. ఈమె వచ్చి చాలసేపైనటు లున్నది.

భీము—(దేవినిజూచి) దేవీ ! అన్నగారి సంధరాయబారపు వార్తవిని చిత్తమంతయు నాగ్రహపూరితమై యున్నకారణంబున నింత దనుక నిన్నుఁ జూడనైతిని. అన్యథా తలంపకుము.

ద్రౌప—నాధా ! నన్నుఁ జూడకున్నను నాపరాభవదావాగ్ని చల్లాఱువఱకు మీరాగ్రహమునుండి విముక్తులు గాకుండనుంటయే పదివేలు.

భీము—దేవీ! నీపరాభవముమాట నింకనెత్తకుము. ఇతరులతో నాకేమిపని. ఈభీమసేనునికంఠమునఁ బ్రాణమున్నంతదనుక నీపరాభవమును మఱువనేరఁడనువిషయమును గట్టిగాఁ గొంగున

ముడి వైచుకొమ్ము. ఓ ప్రాణేశ్వరి! నేఁడు నీమోము దీనత్వమును సూచించుచున్నయది. ఎందుచేత! (అని పరికించిచూచి) సరే. వేఱుగఁ దెలుపవలయునా? ఇది యెఱిఁగియున్నవిషయమే. కాని యేమిచేయగలము.

గీ. బాహుబలశాలులయ్యును  పాండుసుతులు
కలికి యీవిధి నతికష్ట  ములకులోఁగి
యుండఁజూచుచు భీరులై  యుండవలసె
నకట ధర్మజానాజ్ఞ యూ  కడ్డమగుట.

ద్రౌ—చేటీ! మునుపటిపరాభవమే యెఱుంగుదును గాని యిన్ను హానీయుఁడు తరువాతి కథ నెఱుంగఁదునుమా? యువరాజున కావరాభవముఁగూడఁ దెలుపుము?

చేటి—అమ్మా! అట్లనే. దేవా! మీరు కురులనుజూచియే యున్నారు. అమ్మగారికిప్పుడంతకన్న నెక్కుడు పరాభవమే జరిగినది.

భీము—ఆఁ. ఎక్కుడుపరాభవమా! అదేమి చెప్పు చెప్పు?

చేటి—దేవా! భీమసేనకుమారా! వినుము. దేవి గాంధారీదేవిని సందర్శించివచ్చుటకై జనుచున్నయమ్మగారితోడను, సుభద్రాదేవి మున్నగువారితోడను వెడలినది.

భీము—పెద్దలసందర్శించుటందఱకు ముఖ్యకర్తవ్యమే! అయిన?

చేటి—అట్లువెడలి తిరిగివచ్చుచుండ భానుమతి యీసతిని జూచినది.

భీము—(సక్రోధుఁడై) వైరిపెండ్లముకంటఁ బడెనుగా! పిమ్మట?

చేటి—చూచినది చూచినట్లులూరకొనకఁ దన చెలులవంక దృష్టినిలిపి యొకమాటననియె.

భీము—ఏమని?

చేటి—ఓసీ! పరిచారికా! ఏదూర్లి మ్మనియడుగుకొనుచున్న నుఁగురులను ముడుచుకొనవేమే? యని సగర్వముగానడిగె.

భీము—సహదేవా! వినుము. తలయెత్తుము.

గీ. అంతమాట నాడినయట్టి | యధమురాలి
నూరకే విడువఁగమన | పోర్చుటెట్లు
యింక శాంతమువహియించి | యేమిచేయఁ
గలము? తెలియక డెంద మా | కులతఁజెందె.

చేటీ! అందులకిబిడ యూరకుండెనా?

చేటి—ఊరకొనునా! తగిన ప్రత్యుత్తరమీయఁగలిగిన సమర్థురాలయ్యును వెంటఁ బరిజన మంటచే మిన్నకుండె నంత నేనే నాబుద్ధికిఁ దోఁచినట్లుగా మీతలవెండ్రుకలు విడకుండ మా పాంచాలి వెండ్రుకలు ముడివడఁగలవా? యంటిని. తారతమ్య మెంచకుండఁ బలికిన వాక్యములకు మన్నింపవేఁడెద.

భీము—(సంతోషముతో) చేటీ! మంచిమాటంటివి. నీవాడిన మాట కాగ్రహింపనేల? ఈహారమును బహుమానముగాఁ గైకొనుము. (అని హారమొకదానినిచ్చి) ఓపాంచాల రాజపుత్రీ! అనవలసినమాట నీచేటి యననేయునిపది. చూఁడు.

ఉ। కూళలఁ గౌరవాధములఁ | గూల్చెడిదాక నుగర్వియా చుఁ బాంచాలిని దాసివంచు విర | సంబుగఁ బల్కిన రాణి మాకుఁ బాంచాలికిదాసియై బరఁగు | నంతన సుబ్బెడిదాక నిద్రఁబోఁ జాలని భీమసేనకులికంబడి | శాంతి వహింపఁజాలునే.

కావున?

గీ. గదను ద్రిప్పుకొంచు | ఖలుని దుర్యోధను
తొడలు విరుగఁగొట్టి | గడియలోన

నెత్తుటిచేతులంగోడ కెలంత నీకురులను
ముడిచినపైతుఁ జింత నుడుగుదింక.

ద్రౌప—నాథా! మీరుగట్టిగాఁ దలఁచుకొనిన దుర్ఘటమగు కార్యముగలదా? మీమహోద్యమమునకు మీసోదరులుగూడ తోడై నప్పుడుగదా నేను సంతసించుట.

భీము—ఏల కాకుండును? ఒకవేళ సహాయులు గారనుకొనుము, అంతమాత్రముచేత నష్టమేమి?

సీ. చాలఁడే భీముఁడొక్కఁడు శత్రుచయము
రూపుమాపంగ నిదగ కోపవహ్ని
నార్పబడిమండ యేల ? ని యార్తిదీఱ
పోయెని సంతసంబును పొందుమబల.

(తొందఱగా భటుఁడు ప్రవేశించి)

దేవా! భగవంతుఁడు. శ్రీకృష్ణుఁడు.

భీము—ఏడి! ఏడి! శ్రీకృష్ణభగవానుఁడు.

భటు—అయ్యా! శ్రీకృష్ణపరమాత్మను సామాన్యమానవుఁడని తలంచియాతని బంధింప నాదురాత్ము లుద్దేశించిరి.

భీము—బంధింపఁబడెనుగా?

భటు—లేదు విశ్వరూపమును ధరించి యదురాత్ముల నందఱ మూర్ఛాగతులంజేసి వచ్చి పెద్దలను జూడఁబోయెను. మిమ్ములను గూడత్వరితకాలమునందే చూడఁగోరుచున్నారు.

భీము—ఓరిదుర్మార్గుఁడా! భగవంతునే బంధింపయత్నించితివఁటరా! నీవినాశకాలముదాపురమగుటచేతనే నీకిట్టిబుద్ధు లుప్పతిల్లినవి. కానిమ్ము. నీకర్మమున కెవరేమిచేయగలరు? దేవీ! పాంచాలరాజపుత్రీ! వినుచున్నావా?

గీ. సంధికుదురునంచు । సమవర్తితనయుండు
పంపినట్టి రాజు । బారమిటుల
పరిణమించెదాని । ఫలితంబుబోధించె
నన్నుగారికట్టి । యాశలుడిగె.

సహ—అన్నా! వృకోదరా! వాసుదేవుని భగవంతునింగా నెఱుంగఁడు కాఁబోలు. విశ్వరూపసందర్శనానంతరమునఁగూడ తెలిసికొనలేకపోవుట యవివేకముగాదా?

భీమ—తమ్ముఁడా! మూఢులు వాని నెఱుంగనేర్తురా?

గీ. తనబలంబుఁ జూచు । కొనుచు గర్వముచేతఁ
దిరుగువానికెట్లు । తెలియు వాసు
దేవు మహిమనట్లు । తెలిసికోఁగల్గిన
నిట్టిదుర్ణయముల । కెట్టులోర్చు.

మ. అరిషడ్వర్గములన్ ద్యజించుకొని । నిద్రాహారముల్ వీడిభీ
కరకాంతారములందుఁజొచ్చి యతిదీ । క్షన్ శ్రీహరిన్ గూర్చి దు
ర్భరమైనొప్పుచు తపంబు సల్పుమునులే । వానిన్ గనన్ లేక ని
ష్ఠురణిన్ తిప్పలుఁజెందుచుండ నొకతెన్ తాఁ వీడు. మాద్రీసుతా!

ఓయీ! కంచుకీ! ఇప్పుడు మనవారందఱును యేమియొనర్ప నిశ్చయించినారు?

కంచు—అది తమరువచ్చి విచారించఁదగినదే కాని నేను వచింపశక్యంబుగాదు.

(తెఱలో పలుఁ గలకలము)

ద్రౌప—నాథా! అది యేమి?

భీము—మరేమియులేదు. రణయజ్ఞము జరగుచున్నది.

ద్రౌప—మీరుగూడ నుండవలయునుగదా?

భీము—వలదా? మఱి, ధర్మనందనుఁడు సోమయాజివై నీవు సోమిదమ్మవై మేము నల్వురమును ఋత్విక్కులమై శ్రీకృష్ణభగవానుఁ డుపద్రష్టయై యీరణయజ్ఞమును నడువవలసియున్నది. ఈయజ్ఞమునకే కౌరవు లెల్లఱును పశువులై వర్తింతురు. దీనిఫలమే నీసంతోష విచారములకుఁ గారణభూతమగును. సహదేవా! పోవుదమా?

సహ—చిత్తము. మీపాదచ్ఛాయల మెలంగుటయేకదా మాకర్తవ్యము?

భీము—దేవీ! మేము కౌరవవంశనిర్మూల నోద్యోగమునఁ బ్రవేశించుచున్నారము. పోయివత్తుమా?

ద్రౌప—శ్రీహరికరుణాదృష్టి మీపైఁ బ్రసరించి సకలశుభంబులు చేకూర్చెడిని. నాథా! మీరు వచ్చువఱకు నాపరిభవ దావాగ్ని చల్లాఱ నేఱదునుఁడీ?

భీము—దేవీ! ఇంతగా నాకుఁ దెల్పవలయునా?

గీ. కౌరవాన్వయమును నేలఁ గూల్చినాఁడె
యింతి నినుఁజూడగావత్తు నిటకు నేను
పరిభవస్వాంతునై మూర్ఖచరితునగుచుఁ
బ్రాణములతోడ నిన్జూడ రాను రాను.

దేవీ! ఇంక మేము జాగొనర్పవీలులేదు, నీవుపొమ్ము. బుద్ధిమతికా! పాంచాలిని నెమ్మదిగా నివాసభవమునకుఁ దోడ్కొనిపొమ్ము.

చేటి—చిత్తము. అమ్మా! రమ్ము.

భీము—తమ్ముఁడా! పోవుదమురమ్ము?

సహ—చిత్తము.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

---



# వేణీసంహారము

## ద్వితీయాంకము

దుర్యో—వినయంధరా! కృష్ణుఁడంత యవివేకియా?

గీ. ఎదుటను శిఖండిఁ బెట్టుక । ముదుకఁడైన
భీష్ము నెట్టులఁ గూల్చెనా । విధముగాన
యేము నభిమన్యునిన్ గూల్చి । నాము దాని
నెఱుఁగఁ గాలేక కృష్ణుఁ డి । ట్లేలననియొ?.

కంచు—అవివేకిగావుననే స్వల్పములో బైటఁబడినాఁడు. కాని మన మావిధమున సరిపెట్టుకొనినచో మన బాహుబలాతిశయంబుల కేమనికళంకము వచ్చునేమో! దేవా!.

దుర్యో—అవును. అదియును నిజమే గంపెడుబలగమున్న మన మొక్క పసివానిఁగూల్చుటను గూర్చి యింతగావాపోవవలయునా? వినయంధర!.

ఆ.వె. బంధుతతియు మిత్ర । వర్గంబునున్ భృత్య
కోటి రణమునందు । ధాటిఁజావ,
నీనుయోధను వైరు । లెంతయుఁబనిఁబూని
గూల్పలేర? కీర్తిఁ । దాల్పలేర?.

కంచు—(చెవులుమూసికొని) హరిహరి!.

దుర్యో—వినయంధరా! నానోటివెంట నెట్టియువాచ్యము వెలువడినది. ఇంతకును భానుమతినాకుఁ దెలియకుండ నెక్కడకో వెడలిన కారణముచేతనే నామతియిట్టులఁ బాడైనది. ఆమెయాదంతయు నీ కేమైనఁ దెలిసిననెఱిఁగింపుము ;

కంచు—దేవా! ఇటురండు! (ఇద్దఱును నడచుచున్నారు.)

కంచు—దేవా! అరుగో భానుమతీదేవిగారు! చెలికత్తెలచే సేవింపఁబడుచు నాయుద్యానవనంబుననున్నవారు. రండు.

దుర్యో—వినయంధరా! అట్లయిన నేనిప్పుడే దేవితో మాటాడవచ్చెదను. నీవుపోయి రథంబును సిద్ధపఱుపుము. రణరంగమునకుఁ బోవలసియున్నది ?

కంచు—చిత్తము. (అనినిష్క్రమించుచున్నాఁడు)

చేటి—దేవీ! ఇంతవఱకునుఁగల జ్ఞాపకమున కేరాలేదఁటమ్మా?

భాను—అదేవచ్చును. రాకపోవునా? కాని మదిచెదరి యుండుటచే వెంటనే చెప్పఁజాలకుంటినే.

చేటి—పోనిండు. నెమ్మదిగనేవచియింపవచ్చును. సంతప్తహృదయులకదిసహజమేగదా?

దుర్యో—ఈమెసంతాపమునకుఁ గారణమేమి చెపుమా? నేఁడుదయంబున నాతోఁడఁ జెప్పకుండఁగనే లేచివచ్చినది. నేనీమెయెడఁ గావించిన మహాపరాధమేమియును లేదే? పరాంగనలఁగవయఁబోతినా? లేదు. ఈమెనుగూర్చి విరుద్ధముగా మాటాడితినా? లేదు. పరిక్రీడలోఁ బందుకొన్నపుడు యేమేనివిముఖత్వమును గనఁబఱచితినా? లేదు. నేనిప్పుడేవిధముగా నీమెనుబ్రసన్నముఁగావించుకొందును? కానిమ్ము. కొంతతడవిందేయుండి వీరిసంభాషణమాలింతము.

చేటి—అమ్మా! ఆవలి వృత్తాంతమును దెల్పుమమ్మా?

భాను—అనకుల సందర్శనోత్సాహమున నాయొడలే మఱచితినిసుమా?

దుర్యో—ఛీ! ఛీ! ఇదియేమి నకులసందర్శనోత్సాహమున నొడలే మఱచితిననుచున్నదే. ఈమెమ నంబతనిమీాదికిఁబోయి నదా యేమిచెపుమా? ఇండలకేశ్వబోలు నీలాంశులాడికి దెల్లవారక మనుప్పే విజనప్రదేశవిహారంబును, సఖులతోడ సల్లాపములును గావలసివచ్చెను? ఓసీ! పాపాత్మురాలా!.

గీ. పరువుఁగల వంగశంబసి బరిణయంబుఁ
జేసికొని తుట్టతుదకిట్లు మోసపోతి
నెంతటి దురంతమునకు స హించినావొ
జారిణీ! నాదుకోపమే నరణిఁదీఱు?

ఓహో! లోకమున నీయప్రతిష్ఠ నెటుల మాయఁగల్గుదును?

మ. పరిరాజన్యుల మోములన్ గనుటెటో సామంతభూపాలకుల్
పరిహాసంబు లొనర్ప మెల్గుటెటులో పావంబిటుల్ బ్రద్దలై
వరలన్ ప్రాణములన్ ధరింపఁగలనే? పాపాత్మురాలిన్ వెసన్
నఱుకన్ జాలకయున్న నీకులటతో నా యింక సంసారముల్.

కానిమ్ము! ఇంకఁ గొంతతడవిందే విశ్రమించి వీరిసంభావణ మాలింపవలెఁగాక.

చేటి—తరువాత కథ కానీయవమ్మా?

భాను—ఆయానందాతిశయంబుననే యాతలంబునకుఁ జేరఁగల్గితిని గానియానకులకుమారుఁడుగూడ నావెంటనే వచ్చుచుండెను సుమా?

దుర్యో—ఓసిదురంతకురాలా?

గీ. ఎగ్గుసిగ్గునుద్యజియించి యింతయేని
భయములేకుండ జరిగిన పనియదెల్ల

కథగనున్ జెప్పితివి చెలి | కత్తెతోడ
నింతకున్ మించుఘోర మిఁక | కేమిగలదు.

చేటి—అనంతరము, వెంటనేవచ్చుచుండిన యానకులకుమారుఁడూరకుండెనా?

భాను—ఊరకొనునా? గర్వముతో మీఁదిమీఁదికవచ్చి, బలిమిని పైటకొంగును దప్పించెను.

దుర్యో—(క్రోధముతో) ఓరీ! నకులా! నీవినాశకాలము సమీపించినది సుమీ.

గీ. పౌరుషమెయున్న మనలోన | వైరమున్న
ఖడ్గమును దాల్చి కదనరం | గమున కుఱికి
పగనుసాధింపవలెఁగాని | బల్మి మై ప
రాంగనలఁగూడఁ జూతువే? | యధమచరిత.

కానిమ్ము. నీనాశనమున కిది కారణము గావలసియుండ నెవరేమిచేయఁ గలరు?

గీ. ఈసుయోధనుఁడిది సహిం | యించినిన్ను
విడచునే? యాగదను వేగ | నిడదెబలిగ
తారతమ్యము నెంచవె | తగనికార్య
మునకుఁ బాల్పడెదవె నీవు | మూర్ఖచరిత.

(ఆలోచనమభినయించి) ఛీ! ఛీ! ఇదినీలోపము కాదు. దీని ముందుగా నీగదాదండమునకు బలియిచ్చినఁగాని యాకళంకముమాయదు. కాన నేనిదేపోయి.

గీ. భరతకులమందు లేని పా | పంబుఁగూర్చి
యింతఁజేసిన దాని నా | యంతకాల

యంబునన్ జేర్చి వంగడ ! మందునిట్టి
మచ్చలేకుండఁ దిరిగెద ! నిచ్చలోడ.

చేటి—వెనుక నేమిజరిగినదమ్మా?

భాను—నాకింతలోనే మెలకువవచ్చినది. కాని యీ మంగళము ప్రతిహతమగువిధానమే తెలియక భయపడుచుంటినమ్మా.

దుర్యో—ఔరా! ఇదియంతయు స్వప్నవృత్తాంతమా? ఏమి నాచిత్త చాంచల్యము? ఇంతవఱ కదృష్టవంతుఁడనే.

మ. చనసైతిన్ మితిలేని యాగ్రహమునన్ ! చానన్ వధింపంగనే
వనసైతిన్ బరుసంబునొక్కటిని పు ! ణ్యాంబే సతిన్ బాపుకొం
టిని నేనంచు నిరాపనిందపడకుం ! టిన్ పీరిసంభాషణం
బును యేదోసగమాలకించ కఖలం ! బున్ వింటయేమేలమెన్.

(సమీపమునకుఁబోయి) దేవీ! మీసంభాషణము విని యది స్వప్నవృత్తాంతమని ముందుగ్రహింపఁజాలక నేనేమేమియో వాగితిని. ఈనీచలి కాని లోపమును మన్నింపవలయును.

భాను—నాథా! ఇందు నేనుమన్నించఁ దగిన దేమున్నది? తమ కేమియుంటినోవినసైతినగదా? కాని, దేవా! మీవాక్యములఁబట్టి నాస్వప్నవృత్తాంతమంతయు మీరు గ్రహించిరనియే తోచుచున్నది. నాకీ భయ మేలీఋనఁబోఁగలదో?

దుర్యో—దేవీ! ఇంతమాత్రమునకే నీవు జంకవలయునా? దేవీ! భయమువలదు. అతిశౌర్యబలాన్వితులగు సోదరశతంబును గల్గిన యీ సుయోధనునిభార్య యీస్వల్పమునకు జంకుచున్నదనిన లోక మేమనుకొనును.

(తెఱలోఁ బెద్దకలకలము)

భాను—(భయముతోను సుయోధనునిఁ గౌఁగిలించుకొని) నాథా! ఈయుపద్రవమేమి ! రక్షింపుము. రక్షింపుము.

దుర్యో—దేవీ! అదేమియునుఁగాదు. పెద్దగాలివీచుచున్నది.

భాను—నాథా! ఈమహాప్రళయమునకే తృణప్రాయముగ నొనర్చివాళొనుచున్నారు, చూడుఁడు.

గీ. పెళపెళమటంచుచుర్రు పెద్ద పెద్ద చెట్లు
విరిగి పడసాగెలాయముల్ విడిచి హాయము
లదరి పరువెత్తసాగె నల్లదిగో గనుఁడి,
యెటుల భయమందుచుండిరో యెల్ల ప్రజలు.

నాథా! మనమీయుపద్రవప్రదేశముననుండి యీ బారుపర్వతాగ్రమునకుఁ బోవుట యుత్తమమేమో?.

దుర్యో—నీభయముడుగుమని యెన్నివిధంబులఁ దెల్పినను మానకుంటివి. అంతియగాక మనస్వేచ్ఛావిహారమునకుఁ గూడనదియే తగిన ప్రదేశము. పోదమురమ్ము.

(అని యందఱు నడచుచున్నారు.)

దుర్యో—దేవీ! ఇదియిక్కలి యెత్తయినప్రదేశము కాసను గుల నెమ్మదిగ వైచుకొనుచురమ్ము.

[అందఱుఁ బర్వతాగ్రమునఁ జేరుట నభినయించి]

భాను—అమ్మయ్యో! ప్రాణములిప్పటికి కుదుటఁబడినవి.

(ఇంతలోఁ బ్రతీహారి ప్రవేశించి)

ప్రతీ—జయము. జయము. దేవా! సైంధవమహారాజుగారి తల్లియు దుస్సలయును వచ్చియున్నారు. సెలవైనచోఁ బ్రవేశపెట్టెదను.

దుర్యో—(తనలో) ఓహో! అభిమన్యువధకుఁ గారకుఁడితఁడే యని శాత్రవులేవరో ఏదియపకారముఁ జేయసమకట్టియుందురు. అందుచేతనే భీతిలి వీరునాకడకువచ్చిరి. ఓయీ! కంచుకీ! నీవుపోయి త్వరితంబుగ వారినిఁ బ్రవేశపెట్టుము.

ప్రతీ—(అట్లొనర్చుచున్నాఁడు)

మాత—కౌరవేశ్వరా!

గీ. లేకలేకఁ గలిగినయట్టి । నాకుమారు
నెటులరక్షింతువో నాకు । నీవిచార
మెటులమాన్పెదో గతి । యీవకావె
కడుపుశోకము లేకుండఁ । గావుమయ్య.

దుస్స—అన్నా!

గీ. చెల్లెలను దీనురాలను । చిన్నదాన
ప్రేముడినిజూపి యిందాక । పెంచినావు
నేటితోఁబసుపు కుంకుమ । యేటఁగలియ
నున్నయది యెట్లుగాంతువో । అన్న నన్ను.

దుర్యో—అత్తా! ఊరడిల్లుము. చెల్లెలా! ఎందులకట్లు విచారపడెదవు. మాబావగారికిఁ గుశలమేనా?

మాత—ఏమికుశలము నాయనా?

గీ. తనసుతుని చావునకు వాఁడు । తనయుఁడే ప్ర
ధాన కారకుఁడంచుఁ గ్రో । ధంబుఁబూని
యినుఁడు గ్రుంకకమున్న దుర్మ । తునిజయద్ర
ధునినటంచుఁ బార్థుఁడు ప్రతి । జ్ఞనువహించె.

దుర్యో—(వెకిలి నవ్వునవ్వుచు) ఇదియా! మీవిచార కారణము. కడుపుమంటచేవదరినమాటలనులక్ష్యమందుంచుకొని మీరలీలీలవిచారపడుదురఁటమ్మా? అత్తగారూ! ఈదుర్యోధనుని బలగంబు నెఱింగియుండియుఁ బార్థుఁడీయవివేకప్రతిజ్ఞనెట్లుపట్టెను. ఒకవేళ పుత్రశోకమును భరింపలేక, నాతఁడు ప్రతిజ్ఞఁదాల్పెననుకొనుఁడు. సమస్తమెఱింగిన మీరుఁగూడ నవివేకులై యిట్లుచింతిల్లఁదగునఁటమ్మా అమ్మా ?యా! దుస్సలా! పెద్దలైన యత్తగారి నింతమాత్రమోదార్పలేక పోయితివఁటమ్మా?

దుస్స—అన్నగారూ! స్వపక్షపరపక్షబలాబలంబు లెఱింగి యుండినను యీప్రతిజ్ఞమాత్ర మూరకనో దనుభయమును జనించినది.

దుర్యో—ఇంతపిచ్చిదాన వేమయ్యా! వారిప్రతిజ్ఞలన్నియు నట్టివే.

చ. అలసభలోన నాఁడు ద్రుపదాత్మజముందలఁ బట్టి యీడ్వఁగా
వలువలనొల్చుచుండఁ దొడ పైనివసింపఁగ నన్నుఁ జేయ పా
ర్థుఁడటను లేడ యువ్వ దశ రోషముదాలిచి నల్పుఁడే ప్రతి
జ్ఞల నవియన్ని యేమయెను గాన భయంబునువీడుమన్నరో.

నిజముగా వారుక్షత్రియులై క్షాత్రధర్మావలంబకులైయైన నింతకాలము ప్రతిజ్ఞల మట్టిలోఁగల్పుకొని యున్నకుందురా? లోకమందంతటను బూరిగాఁ దెలియఁబడిన పాండవప్రతాపమునకా మీరుజంకవలసినది?

దుస్స—అన్నా! సుయోధనా! తానుతనప్రతిజ్ఞను నిర్వహింపఁ జాలకున్న గాండీవసహితుండై భస్మమైపోవుదునని కూడ తీవ్రముగఁ బలికినాఁడు. అందువలన నీవెంతయూరడించినను మాకు ధైర్యము గలుగకున్నయది.

దుర్యో—చెప్పవేమి? అట్లయిన మీరువిచారపడ నక్కఱయే లేదు. మీరుమిక్కిలి సంతోషింపవలయును. ఏమందురా? ఈప్రతిజ్ఞతోఁ దప్పక పార్థుండస్తమించెనని దలంపుఁడు. తత్కారణమున ధర్మనందను డనుజసమేతుఁడై కూలును. కౌరవబలమా కౌరవబలమనిన సామాన్యమా? వీరియందఱితోఁ బనియేలఁజూడుఁడు.

గీ. విల్లుధరియించి నిలచిన భీముఁడేమి
పార్థుఁడేమి రణాన నిల్వంగలారె
సైంధవుఁడుఁటన్న నల్పుఁడే సమరమునకు
జంకునే వానియెడ మీకు శంకయేల.

అబలలగు మిమ్ములను నమ్మించుట యన మావంటివారికి ప్రాణసంకటముగనే యున్నది. ఓయీ! కంచుకీ! నీవు వేగముగఁబోయి రథంబును సిద్ధపఱుపుము.

కంచు—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

దుర్యో—ఓ అత్తగారూ! ఓ చెల్లెలా! ఓ దేవీ! మీరింక నంతఃపురంబులకుఁబొండు. నేనిప్పుడే రణభూమిఁజొచ్చి జయద్రథునకు సాయమై మీభయంబును నివారించెదను.

[అందఱును నిష్క్రమించుచున్నారు]





# వేణీసంహారము

## తృతీయాంకము.

(అశ్వత్థామ ప్రవేశము.)

రణభూమికిఁ బోవుచున్న నాకీయనిమిత్తము లేమి? నేఁడేమియూహ నున్నది? (కొంతదూరము నడచి) ఓహో! యేమి సమరము. రక్తమేరులై పారుచున్నదే? మహాయోధులమని మీటిబిరుదంబులఁ దాల్చిన వారుఁగూడ శాత్రవులకు భయపడి పారిపోవుచున్నారు. కారణంబేమి చెపుమా? వీరికిఁ బ్రాణములపై నింతటి తీపి కాఁబోలు. ప్రాణికోటికి మృత్యువు సహజంబని యెఱిఁగియుండియు భీరుత్వమును దాల్చువారు తగుదుమని రణరంగమున కుఱుక నేల? చివఱకీ పాఱుబోతుఁదనమేల? ఇదియేనా? వీరల రాజభక్తి. ఇట్టిపిఱికిపందల నమ్ముకొనియేనా సుయోధనుఁడు సంధిఁ జెడఁగొట్టుకొని యుద్ధమునకు దిగినాఁడు. (ఆలోచించి) ఇందు సుయోధనుని లోపమేదు.

గీ. సర్వమును నిర్వహింతు శాశ్వతముగాఁగ
రాజ్యరమఁగట్టిపెట్టెదఁ బూజ్యులైన
వారినందఱి నిదాన వర్గమందుఁ
దేర్చెదనటంచుఁ గర్ణుండు చెప్పిచేసె.

నేఁటియుద్ధమునకు నాయకత్వము వహియించినది నాతండ్రిగారుగదా? వారిచే సంరక్షింపఁ బడుచుండియు వీరీవిధంబునఁ బిఱికితనము వహింపఁ గతమెయ్యదియో తోఁచకున్నది. వీరీవిధంబున వెన్నిచ్చి పాఱుచున్న

దులకు నాతండ్రిగారెంత విచారించుచుండిరో? ఈయపకీర్తి నాతండ్రిగారిని చుట్టుకొనును గాఁబోలు. నేనింక నాలస్యమొనర్పక నాతండ్రిగారికి సాయమొనర్పఁబోయెదఁగాక! (ముందునకు నడచి) ఆహా! ఏమి యీపంక్తిభేదము. ఛీ! ఛీ! ఇట్టిభీరులను శూరులుగా విశ్వసించి రణభూమియందు వదలిడిన నాతండ్రిగారిదిగాని వీరిది కాదీలోపము. ఓ కౌరవచమూపతులారా!

గీ. సమరముఖమందుఁ గాలిడి శాత్రవులకు
జంకి పరువిడి పోదురే చావు మీకు
తప్పునే యుండుచే జంతుతతికి సహజ
మగుట చావునుమార్చి మీ రడలకండి.

లోకత్రయైకధనుర్ధరుండగు నాతండ్రిగారికీర్తిని నుట్టిపాల్సేయకుఁడు. మీకేవిధమగు భయమునులేదు. (అని యేమో చెప్పఁబోవుచుండ) ఇంక మీతండ్రి యెక్కడ?

అశ్వ—(విని) ఎవరురా! ఈయవాచ్యముల నాడినది. ఓ తుచ్ఛులారా!

గీ. పవలుచుక్కలఁ బొడుపవక ద్వాదశార్కు—
లుదయమందక యీవిధి నుండఁగాను
శౌర్యగుణరాశియగు నాదు జనకునిటుల
పాపముల నాడెదరె? తలల్ వ్రక్కలవవె?

(వెంటనే సూతుఁడు ప్రవేశించి)

సూతు—నాయనా! నేనేపలికితిని. ఇంకతండ్రిగారెక్కడ నాయనా?

అశ్వ—ఇంక నాతండ్రిగారెక్కడనా? లేనేలేరా? అస్తమించిరా? లోకైకధనుర్ధరుండగు ద్రోణాచార్యులవారే యస్తమించిరా? సూతుఁడా! నాతండ్రిగారేనా యస్తమించినది!

సూతు — అన్నను తండ్రీ!

అశ్వ — హా తండ్రీ! (అని మూర్ఛిల్లుచున్నాఁడు.)

సూతు — నా యన్నా! ఊరడిల్లుము.

అశ్వ — (తెలివివచ్చి విచారముతో) అశ్వసేనా?

గీ. అంతటి మహాత్ముఁడీవిధి ఽ నస్తమించె
ననెడివార్తనువిని యెట్లు ఽ మనెదనింకఁ
బరశురామాస్త్ర సర్వస్వ ఽ ప్రతిగ్రహ ప్ర
వీణులగు తండ్రిగారి నే ఽ విధిని మఱతు.

సూతు — కుమారా! వీరపురుషోచితమరణమందినతండ్రిగారినిఁ గూర్చి విచారించెదరా? ఇదివీరపురుషోచితమగు లక్షణమా! ఊరడిల్లుము.

అశ్వ — అశ్వసేనా! ఊరడిల్లుమని చెప్పుట సులభమేగాని యూరటఁ జెందుటయే దుర్ఘటము. ఏమందువా? నాతండ్రిగారనిన సామాన్యుఁడు. గాఁడు. చూడు.

ఉ. అమ్ములవిద్దె నేర్పి తన ఽ యంతటివానిఁగఁ జేసి మూడులో
కమ్ములయందునన్ ప్రతిభఁ ఽ గాంచిన యట్టిగురుండు అట్టివా
డిమ్మెయిఁ బుత్రికున్ విడచి ఽ యేగెనటంచును విన్న నీవిచా
రమ్మును మానుటన్న సుక ఽ రంబగు నేయుటుఁ జేయ శక్యమే.

సూతు — తండ్రీ! విచారించి చేయఁగలిగిన దేమైనఁగలదా?

అశ్వ — ఉన్నది. లేకపోలేదు.

గీ. కొడుకునై పుట్టినందుకు ఽ విడువ వలసి
నట్టి నీరంబువిడచి ద ఽ యాంబురాశి
యైన నాతండ్రిగారి ఛా ఽ యలనుబట్టి
వారిఁ గనఁబోవుటలె ముందు ఽ దారినాకు,

కాని, యశ్వసేనా? తండ్రిగారి యస్తమయ కారణమేదియో యెఱిఁగిం
పఁగలవఁటయ్యా ?

ఉ. గాండివిసాహసించె నెుజ్జెగద్దురు నిట్టులఁ జేయఁ? బెన్గదా
దండముచే వృకోదరుఁడె తండ్రిని యీవిధిఁ జేసెనొక్కొ? వె
న్నుండవకారియై యిటుల నున్ బొనరించెనో? వీరుగాక వే
ఱుండొరు వైరులాతనికి యున్నది యున్నటులన్ వచింపుమా.

సూతు—వీరు ముప్వురును కారకులుగారు. నీ తండ్రిగారి మ
రణమునకు నీవే కారణ భూతుఁడవు !

అశ్వ—అశ్వసేన ? ఏమంటివి ? నాతండ్రిగారిమరణమున
కుఁ గారణ భూతుఁడను నేననియా! హా ! తండ్రీ! ఎట్టి యపఖ్యాతి
నొదల ధరించితిని? నిన్ను ద్దేశించి బుద్ధిపూర్వకముగా నొక్క పరుష
వాక్యమైనఁ బలికి యెఱుంగనే? ఒక్క యపచారమైనఁ జేసి యెఱుంగ
నే! సంతతంబును నీపాదచ్ఛాయల నాశ్రయించుకొని తిరిగెడి నేనా?
నీచావునకుఁ గారకుఁడను! ఇట్టి యపవాద మానెత్తిపైఁ బడుట నాపూ
ర్వకృత పాపపరిపాకఫలంబుగాక మఱేమి ? జనకా! నేనేమని యప
చార మొనర్చినచో నాకర్మమునకుఁ దగిన శిక్ష నాకు విధింపవలయు
నుగాని నీవాయనుభవించవలసినది ! నీశాపవాక్కు నన్నెంతఁ
జేయఁజాలదు? హా! జనకా! ఈ నీవియోగబాధ నేనెట్లు భరింపఁగల్గు
దును, తండ్రీ! నాకీ ప్రపంచమే వేఱు విధముగా గన్పట్టుచున్నది. అ
శ్వసేనా ? నాతండ్రిగారి మరణంబునకుఁ గారణభూతుఁడ నేనని
వచింపఁగల్గిన నీకు నేనేవిధంబుగఁ గారకుఁడనైతినో దప్పక దెలిసి
యుండును. దానిని గూడ నా చెవులఁ బడవైచితివేని యిప్పటికో నీవిధి
ని బూర్తిగ నెఱవేర్చుకొనిన వాఁడవగుదువు.

సూతు—నాయనా! నేనేమని దెల్పుదును. ధర్మనందనుఁ డశ్వ
త్థామ హతః యని బిగ్గఱగా నని కుంజరః యని మెల్లఁగ ననియె,

అశ్వత్థామహతః యని వినఁబడుటయు, నాకలుకలు ధర్మనందనుఁడగుటయు విశ్వసించి నీపై నున్న ప్రేమాతిశయముచే నా మహామహుఁడస్త్రపరిత్యాగముఁ గావించె. ఇది యదనుగా నొనర్చుకొని క్రూరరిపుండంత చేసె.

అశ్వ—హా! తండ్రీ! పుత్రవత్సలా!

గీ, నేను చచ్చితినని విని । మేనువిడచి
పోయి వాడ వెవృధా స్వర్గ । మునకుఁ దండ్రి
కొడుకుతీపినిముం తేని । విడఁగ లేని
నిన్నుఁ జేరక యెట్లు శాం । తించువాఁడ.

జనకా! ఈదౌర్భాగ్యునిపై నీకింత ప్రేముడి యేలనయ్యా! నాయసత్యమృతివార్త విన్నంతమాత్రముచేతనే యస్త్రపరిత్యాగ మొనర్చుటయొగాకఁ ప్రాణ పరిత్యాగ మొనర్చిన నిన్ను నీప్రేమవాత్సల్యంబును ఆదర్శ ప్రాయముగా గైకొని నేనొనర్పఁదగిన కార్యమింతకన్న నేమున్నది? (అతివిచార మనస్కుఁడై) దుర్భరము. ఈవియోగమును భరియించుట దుర్భరతరమైనదే. ఈచింతా సముద్రమును దరించుట దుర్భరతమమైనదే. నేనింక నీతలంబున నిలువఁజాల. నిలువఁజాల. నేను బ్రతికిమాత్రము చేయఁదగిన కార్యము లేమున్నవి?

గీ, తండ్రిగారి ప్రాణముఁదీసి । దారుణమగు
చింతఁ గూర్చిన యట్టి యా । చవటఁబట్టి
కూల్చినంత మాత్రముచేత । కొడుకుతీపి
జ్ఞప్తికిం దెచ్చుకొంచు రా । గలఁడె తండ్రి.

హా! శిష్యప్రియా! హా! సకల సద్గుణరాశీ! హా! తండ్రీ!

(మూర్ఛిల్లుచున్నాఁడు)

సూతు—కుమారా! నీవింతగా దుఃఖపడరాదు. శాంతింపుము.

(అంత కృపుఁడు ప్రవేశించుచున్నాఁడు)

కృపు—పుడమిపై మానవజన్మమెత్తినందులకు సార్థక్యత యుండవలయును. అది లేనిచో నీ జన్మకాల్పనా? ఇంతవయసు వచ్చి గడ్డములును మీసములును నెరసినందులకు మేమనుభవించిన సౌఖ్యమేమి! ఏదియు లేక పోఁగా నంతటి రచ్చలో ద్రుపదాత్మజపుట్టంబు లొల్చుచుండుటఁ జూచినారము. నేఁడు జగద్గురుఁడనఁ బఱఁగిన ద్రోణుని చావునుఁ జూచినారము. ఇంతకంటెఁ జూడఁదగిన ఘోరములుండునా? ఛీ! ఛీ! యిట్టి దురాగతములఁ జూచుటకే యింతకాలము జీవించియుంటిమి కాఁబోలు. ఓదయామయా! పరాత్పరా!

శా. ఆపద్బంధుఁడ వన్న మేటియశ మీ । వధ్యాన్నమున్ జేసి యీ
పాపంబుల్ గనుమంచు మమ్ము బ్రతికిం । పన్ బోలునే నీకున
ట్లా పాంచాలిని యిట్లు ద్రోణుఁ గనఁగా । నయ్యో కటాక్షించుచున్
మాపో రేపో యొసంగుమా మృతిని । కృష్ణా! దేవకీనందనా!

(అటునిటుఁ జూచి) అదుగో అశ్వత్థామ! వీనినిప్పు డేమని పలుకరింపఁ గలను? పలుకరింపకఁ దప్పునా? దగ్గఱకుఁ జని బాలకా! ఊరడిల్లు మూరడిల్లుము.

అశ్వ—మూర్ఛనుండి తేఱి దుఃఖముతో) ఓధర్మనందనా!

ఉ. ఎంతయొ గొప్పవాఁడవని । మోఁదలఁబోసితినింతదాక, ర
వ్వంత యబద్ధమాడి గురు । పాలిట మారకుఁడైతివీవు ఛీ
ఎంతటి ఘోరకార్యమున । కీవుదలంచితివయ్య వంగడం
బంతయు పాడుచేసితివ । హా నిను యేమనియందు ధర్మజా.

గీ. ఎన్నఁడును బొంకి యెఱుఁగని । నిన్ను నమ్మి
గాదె నాతండ్రి యిట్లు నా । మీఁద ప్రేమ
వీడఁగా లేక సుసురుల । వీడినాఁడు
కంచెయే చేనుమేయఁగఁ । గలదెదిక్కు.

గీ. మీఁకె గాకుండ గురుఁడగు లోకములకు
దానినైనను దలఁచుట మాని యెట్టు
ఘోర కార్య మొనర్పఁగా గోర్కె నీకుఁ
బుట్టినదొ ధర్మజా యెట్లు బొంకినావొ.

గీ. పార్థుఁడైనను దెలుపఁడే వలదటంచు
బోధ సేయఁడె శ్రీకృష్ణ మూర్తియైన
నందఱకు నొప్పుపడియెనే యపుడు ధర్మ
నందనా! యేవిధిని శాంతిఁ జెందెదయ్య.

కృపా—వత్సా! నేను నీ మేనమామను. వచ్చి చాలాసేపైనది. విచారముడిగి యిటు నావంకఁ జూడుము.

అశ్వ—(శిరమెత్తకయే) మామా! మీయట్టివారి మొగముఁ జూడ నోచుకొనవలదా?

ఆ. వె. తండ్రిగారిమృతికి తనయుఁడే కారణం
బనెడి పెద్దనింద నంది నేను
తలను నెత్తుకొంచు దిగుదంచు మీమొగ
మెట్లు జూతునయ్య యింక మిమ్ము.

మామా!

గీ. ఋణమయేనియు నిను వీడ కనుసరించు
నీదు ముద్దుల మఱఁదియా నా సుతండ్రి
యెచటనుండెనొ తెలిపి నే నిడెదు వంద
నంబుల గ్రహింపుమయ్య కృపాంబురాశి.

కృపా—నాయనా! సర్వంబును నీవిదివఱకే వినియుందువు. నేనింకఁ దెలుపఁదగిన దేమున్నది? నీవింక నీలాగున విచారమందకుము.

అశ్వ—మామా! విచారపడక నేను చేయఁదగిన దేమైనఁ

గలదా! వినను పెద్దలమాట తిరస్కరింపక పాదముఖమును విడచి నా తండ్రిగారి ననుసరింపఁ బోయెదను. (అని లేచుచున్నాఁడు)

కృపా—అబ్బాయీ! నీకిది యేమి వెఱ్ఱి! ఇట్టి సాహసమున కుపక్రమింపఁ దగునా ?

అశ్వ—అయ్యా!

గీ. కొడుకుపైఁ గల ప్రేమను విడఁగ లేక
స్వర్గపురికిఁ జేరినట్టి నా జనకు కడకుఁ
బోవకుండిన నేనెట్లు పుత్త్రుఁడగుదు
వాని ఋణమెను దీర్పఁగా వలదె నేను.

కృపా—నాయనా! తండ్రిల ఋణమును దీర్చుకొనుట కిదియా మార్గము. కాదు కాదు. ఇహపరంబులకుఁ దగినమార్గము లనేకములున్నవి. అదియునుఁగాక! జీవకోటి కంతకును గిట్టుట యను నొక సహజ విధానముండ దానిని మనము కాదనఁగలమా? కొడుకులొనర్పఁదగిన యథోచిత కార్యములచేతఁ బితృఋణముఁ దీర్చుకొని చిత్తశాంతి నందుము. మామాట వినుము.

అశ్వ—ఆర్యా! మీరు పలికినదంతయు వాస్తవమైనదియే. కాని యీదుర్భర వియోగమును సహింప లేకుంటిని. మనంబంతయు నాందోళ మంది తండ్రిగారిని చూచుకొనుటకే తత్తఱపడుచున్నయది. నేనొక్క క్షణమేని యాగఁజాలకున్నాఁడ. పోయెద. నన్ను క్షమించుఁడు. (శస్త్రమును జూచుకొని) శస్త్రరాజమా! నేనేదో నిన్ను సంతృప్తి పఱుపఁగలవాఁడనని గంపెడంతాశతో నాహస్తంబునందధివసించితివి. అట్టి యాశ నేఁటితో తీఱిపోయినది. నేను నీపైఁగల ప్రేమానురాగముల వదులుకొని నిన్నుఁ బరిత్యజించుచున్నాఁడ. కడిపెడు విచారముతో నుండినను యింతదనుక బ్రదికిన వాకడ నీవింక బాపుకొనఁగల్గిన దేమియును లేదు. ప్రపంచమంతయు నొక్క పెట్టున నెత్తివచ్చినను

చలింపని మహానుభావుఁడగు భారద్వాజుఁడస్తమించె, నేనింకనిదే విధం బుగ బ్రతుకఁ దలఁచి యిట్లు పరిత్యజించుచుంటి ననుకొందువేమో లేదు. లేదు. న్యాయమును బట్టి చూడ పితృప్రేమ యధికమైనదిగదా? అందు కొఱకే నేను మాతండ్రిగారి యొద్దకుఁ బోవుచుంటిని. నన్ను విడనాడవలసి వచ్చినందుల కేమాత్రమును విచారపడకుము. నీకు సర్వశుభంబులు గలుగుఁగాక పొమ్ము. (అని విడువఁబోవుచుండ)

(తెరలో)

జగత్పూజ్యులగు నాచార్యులవారి నారీతి ధృష్టద్యుమ్నుఁడు పరి భవించుచుండ మీ కేమికన్నులుగానరాకుండెనా? ఎందులకిందఱు రాజులు చేతులం దాయుధములుధరించియు నిష్ప్రయోజకులగుచుండిరి.

అశ్వ — ఏమీ! యీ పరిభవము నాతండ్రిగారికే!

(తెరలో)

ఓ రాజులారా! అల్లదె ధృష్టద్యుమ్నుఁ డాచార్యులవారిగొంతు గోసి పర్వెత్తుచున్నాఁడు. రండు. రండు.

అశ్వ — (విని) ఓరీ! ఎవఁడురా! అట్టితుచ్ఛుఁడు? నా తండ్రిగారి తలను ముట్టుకొనుటకే సాహసించెనుగా? మామా! నాకీకడుపు మంట చల్లాఱుటెట్టులయ్యా! ఓధర్మరాజా! ఓవృకోదరా! అర్జునా! ఓకృష్ణా! మీకన్నులు కాలిపోయినవా?

గీ. చెనఁటి యొక్కఁడు నాతండ్రి శిరముముట్టి
యంతలో నరించుచుండ మీ స్వాంతములెటు
సమ్మతించెను మీ దగు శౌర్యములెటు
దాగికొనియెను సిగ్గునే లాగులేదు.

ఛీ! ఛీ! అంతటి మహానుభావుఁడు పరిభవమందుచుండ నోళ్ల యందు వ్రేళులుంచుకొని వినోదమును జూచుచున్న మీఘనతలెందు లకు? మీరందఱును పాపాత్ములే. మీ మొగంబులఁ జూచినను పాత కంబు సంభవింపఁగలదు.

గీ. గురునిశిరము ముట్టి । కుటిలాత్ముఁడా క్రందు
పాదమోడిఁగట్ట । పందలగుచు
నూరకున్న మిమ్ము । నూరకవిడతు నే
చీల్చుఁగాక వేయి । చీలికలుగ.

గీ. ద్రోణిబలము మీరు । తలపరే ? యిందుకై
గలుగునట్టి ఫలముఁ । దెలియలేరె
పాతకంబునందు । భాగంబుఁ బంచుకో
గలిగినట్టి మిమ్ము । బలిగనిత్తు.

సూతుఁడా! వేగంబుగా నీవుపోయి మదీయరథంబును రణంబునకు వలయు నుపకరణములతోఁ నాయత్త పఱపుము.

సూతు—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు)

కృపు—ఇది వీరపురుషోచిత లక్షణమగునుగాని చచ్చినవారికై చత్తుమని వెనుఁగులాడుట ధర్మమగునే ? అంతియుగాక !

గీ. పెద్దలగునీకు తండ్రిని । భీష్మునిమ్మ
గాదె దుర్యోధనుఁడు యీయ । గాధమందు
దిగెను వారలకొఱతను । దీర్తువేని
సంతసింపండె కౌరవే । శ్వరుఁడు మదిని.

కావున మనమిపుడు నీతండ్రిగారి యస్తంగతముకై వగచుచున్న సుయోధనునికడకుఁ బోయిన నిన్ను సేనాధిపతిగా నొనర్చు భావికర్తవ్యమునకై గడంగును. అట్లుగాక మనమన్యథా జరిగించినచో మధ్యగా నాతనికిద్రోహ మొనర్చిన వారమగుదుము. ఈయుపసందను మనమెన్ని జన్మములకేనిఁ బోగొట్టుకొనఁజాలము.

అశ్వ—మామా! నీయూహ బాగుగానున్నది, అట్లయిన నేనింక నాదుఃఖమును విడచిపెట్టి నీచెప్పినచొప్పున దుర్యోధనుని కడకుఁ జని వానినూరడించి సేనాధిపతినై యుంతపావమున కొడిఁగట్టుకొనిన

యామార్థుల నిప్పుడే రణభూమికి బలియిచ్చి వానిమనంబునకు సంత సంబొడఁ గూర్చెదగాక,

కృప—కుమారా! నీ తెగువకు నేను చాలసంతసించితి. మన మింకఁ బోవుదము రమ్ము.

(వెడలుచుండఁ గర్ణదుర్యోధనులు ప్రవేశించుచున్నారు)

దుర్యో—మిత్రమా! కర్ణా! ద్రోణుఁడు తనసహజగుణమును బోనిచ్చినవాఁడు కాఁడుసుమీ! అతఁడు క్షత్రియకులోద్భవుఁడైనచో నట్లొనర్పఁగలఁడా? బ్రాహ్మణకులవిధానంబను సరించి పవ్వుబ్రాహ్మణులనియెడులోకోక్తిని స్థిరపఱచినాఁడు.

కర్ణ—కౌరవేశ్వరా! శస్త్రమునుజ్జగించుటలో నాచార్యుని యభిప్రాయమిదిగాదు.

గీ. ఈధరాముఁడలంబంతే నేలునంత
వానిగ నొనర్తుమను నభిప్రాయముండె
నద్విపర్యంబగుటచేత శస్త్రమేల
హాస్తమునయంచునతఁడటు లాచరించె.

మిత్రమా! ఇదియిట్లుండనిమ్ము. ఆచార్యుండెంతటివాఁడో కనిపెట్టితి వా? ఇంతియుద్ధముజరుగుండ, మనవారిలోని యోధానుయోధులందఱకెన్ని పర్యాయములో యాపదలుసంభవించుచుండఁ దానుగనియుఁగన నట్టులూరకుండి తనపాండవపక్షపాతము ను వెల్లడించుకొనియె. సఖా! నేను మొదటినుండియు నిట్టికృతఘ్నులను నెంతమాత్రము విశ్వసింప వలదనియే మొత్తుకొంటిని. వారివారిమనోభిప్రాయములు, వారిపక్షపాతహృదయములు నాకొక్కనికేగాక మనపక్షమునకింతకును దెలియును సుమా.

దుర్యో—మిత్రమా! వారినిఁగూర్చి నాకుమాత్రము దెలియదనుకొంటివా? ఇప్పుడు నూతనమేమున్నది. అర్జునుండు మనజయద్రథుని

బట్టివధించుచుండ మనపక్షమువాఁడుగదా! తానించుక కానటరై యర్జునునితోఁ బోరిన మనదుస్సలకీగతివచ్చునా? అన్నియుఁ దెలిసి యుండినను మనమిపుడు చేయఁగలదేమున్నది.

కృప—నాయనా! ద్రోణజా! కౌరవేశ్వరుండల్లదె కర్ణునితో నేదియో మాటలాడుచు నావృక్షముక్రిందఁ గూర్చున్నవాఁడు. పోయి కలిసికొందము రమ్ము. (అనిదగ్గఱకుఁ బోదురు).

ఇద్ద—హేరాజన్! విజయతాం, విజయతాం.

దుర్యో—గురువర్యా! నమస్కారము. ద్రోణాయనీ! ఇటు దగ్గఱకు రమ్ము?

గీ. నేనెగదకారకుండను నీకు నీదు
తండ్రికేడఁ బాటుగల్గంగ తప్పిదంబు
మనమునందుంచుకొనకయ్య నను క్షమించి
కాఁగిలిగదవయ్య నా కృతఘ్నుఁజూచి.

(అని చేరువకుఁబోయి కౌఁగిలించుకొని) ద్రోణజా! కూరుచుండుము.

అశ్వ—(నెమ్మదిగా) హా! తండ్రి! నావిచారము నేనెట్లుమఱువఁగల్గుదును? (అనికన్నీరు విడచుచున్నాఁడు)

కర్ణ—ద్రోణాయనీ! దారుణంబగు నీశోకవహ్నిని గడచుట దుస్తరంబే. ఐనను బరితపించి చేయఁదగినదేమున్నది?

దుర్యో—ఆచార్యపుత్రా! నీదుఃఖమునందు నేను నగభాగస్థుఁడను సుమా?

అశ్వ—అందుకొఱకే నాభారము కొంతతగ్గినది. కానికౌరవేశ్వరా! ఇఁకముందు కొడుకులనుగూర్చి యాశవదుతండ్రులుండరు సుమా! ఏమందువా? నాపుట్టినవాఁడు జీవించియుండఁగనే నాతండ్రి శిరంబునొక తుచ్ఛుండుముట్టుకొనియె. అంతవానికిఁ బుత్రుఁడనై పుట్టి నేనుచేసిన ఘనకార్యమేమి?

కర్ణు—ఏమిచేయఁగలము ? కాని ద్రోణజా! చూడు.

గీ. శత్రువుల రూపుమాపంగఁ జాలినట్టి
ఘనబలాఢ్యుఁడు తనశస్త్రము వృథాగ
జారవిడచుక నీగతిఁ జావుఁగోరి
తెచ్చుకొన్నాఁడు నీతండ్రి తెలివిమాలి.

అశ్వ—కర్ణా! ఏమిచేయఁగలమనియా ప్రశ్నింతువు? చేసెడి కార్యమే లేదా ? ఈశోకదవానలంబూరక నే చల్లాఱునటుకొంటిరేమి ! అటులెన్నఁటికిని దలంపకుము. ఈద్రోణజుఁడా వైరిమండలమంతయు వధింపఁబడుదనుక నిదురఁబోవునా? కాలుఁడుగాదు, ఫాలాక్షుఁడుగాదు, కృష్ణుఁడేగాదు, వీరితాతయైనను సరే, శత్రుపక్షమునఁజేరి యెత్తివచ్చినను వారందఱపాలిఁట నేమహాకాలుండనై వర్తించి నిష్పాండవంబొనర్చి తండ్రిగారిఋణమును దీర్చుకొందును. తెలిసినదా ?

కృపు—రాజా! మనద్రోణాయని యిప్పుడున్న శోకభారంబున నన్నంతయుఁ జేసితీరువాఁడనుమీ ! కానమూపలుకులాలించి వీనిని సేనాధిపతిగా నియోగింపుము ?

దుర్యో—ఆచార్యా! మీరు చెప్పినరీతి నొనర్పుటమాకు విధియే గాని సేనాధిపత్యమీవఱకే కర్ణునకొసంగుటచే మిగిలిపోయినది.

కర్ణు—ద్రోణజా ! వాక్శూరత్వమునకును గార్యశూరత్వమునకును చాలభేదమున్నదినుమా ! అట్టిప్రగల్భములఁ బ్రకటించుటలో మనపక్షములోఁ జాలమంది గలరు.

అశ్వ—అదినేనెఱుంగక పోలేదు. నాకడుపుమంటకొలఁది నా భవిష్యత్కార్యవిధానమును సూచించితినిగాని మహామహులఁ దిరస్కరింపవలయుననిగాని, యీసామ్రాజ్యమంతయు నెత్తిపైఁగట్టుకొని యూరేగుదమనిగాని యట్లుపలుక లేదు.

కర్ణు—ఓ ద్రోణాయనీ! కడుపుమంటఁ జల్లార్చుకొనుటకు పద్ధతులు వేఱున్నవి. గాని ప్రగల్భములతోఁ జల్లాఱదు.

అశ్వ—ఓ కర్ణా! నీవును నీచేవకొలఁది ప్రగల్భములఁ బలుకవచ్చును. రణముఖంబున బలాబలంబును జూపవచ్చును. కాని యొకరి నాక్షేపింపవలసిన యవసరము నీకేలఁ గలిగినది?

కర్ణు—ఏలగల్గినదనియా! భీరులపద్ధతినవలంబించి వీరపద్ధతి త్యజించితివని.

అశ్వ—అనఁగా!

కర్ణు—అర్థమే కాలేదా! భీరులు తమశోకవహ్నిని కన్నీళ్ళవిడచి చల్లార్చుకొందురు. వీరులాయుధపాణులై రణభూమినిఁ జొరబడి శత్రుసంహారణోత్సాహమునఁ జల్లార్చుకొందురు. నీవర్థమడిగితివి గానఁ జెప్పుచున్నాఁడను. నీవు వీరుఁడవునుగాదు భీరుఁడవునుగాదు. రెంటికినిఁ జెడితివి. తెలిసినదా?

అశ్వ—ఓరీ! సూతాపసద! ఏమిరా వదరుచుంటివి. (అని లేవఁబోవుచున్నాఁడు.)

కర్ణు—నేనెవఁడనైననేమి! కావలసినది ఖ్యాతి.

అశ్వ—ఓరీ! వాచాటా! నీగౌరవఖ్యాతులు నీకు తెలియకున్నను నాకుఁ దెలియును. లోకమునకుఁ దెలియును. మనవిషయమునకు మనమే పొగడుకొనవలయునా? జాతిలక్షణమును విడనాడలేక నే యిటులంటివి. నాశోకమును కన్నీళ్ళతోఁగదా తీర్చుకొమ్మంటిరి. సరే తెలిసినది.

గీ. శాపవశమున నాదగు శస్త్రములను
కూడవమ్మయి పోయిన నాఁడునటులె
చేసెదనులేర! నీవలెఁ జేవఁదక్కి
పరుగిడకలేర సమరంబు వదలిపెట్టి.

ఓరీ! బాలిశా! నీశక్తి కిందోడు నన్నధిక్షేపించువాఁడవైతివా?

గీ. కనులనీరము చేతనో । కదనమందు
ఖడ్గమూని నిల్చియో తండ్రి । గారి ఋణముఁ
దీర్చుకొందునుగాని నీ । తిట్టునాకు
రాదని దలంచియిఁక వద । రంగఁబోకు.

ఏవిధానసమర్థించుటకేనియు మేము శక్తులముగాని సూతకులసంజాతుఁడవై స్తవములొనర్చుకొని జీవించుమీరు శక్తులగుదురా? అధికారగర్వంబున క్రిందుమీఁదుఁగానకుంటివేమో?

కర్ణు—ఓరోరి వృథావిప్రగల్భవాక్యవిశారదా! ఏమంటివి? నా యస్త్రంబులు వమ్ములైపోయినవనిగదా? పోయినఁ బోవనిమ్ము గాని యేదోయొక మిషనుగల్పించుకొని యశక్తులమై చేతనున్న ఖడ్గంబుల నేలపైఁ బారవైచుకొనముగదా? వైరులను సంహరించి విజయధ్వజంబును చేతధరించుటలో, వైరులచేతఁజిక్కి వీరమరణంబునందుటో యది శూరలక్షణము. ఈశాపములు మమ్ము వెఱపించునవిగావు. మావిఖ్యాతికిఁ గళంకముఁ దెచ్చునవి కావు.

అశ్వ—(క్రోధముతో) ఓరోరీ! రాధాగర్భభారభూత! ఇటుల జగత్పూజ్యులగువారినిఁ దిరస్కరించుటచేతనే నీకర్మమటులఁ గాలి పోయినది. సకలసద్గుణరాశియగు మజ్జనకుని నాక్షేపించెదవఁటరా? మూర్ఖుఁడా?

గీ. తండ్రిగారేలఁ జచ్చిరో । ధర్మసుతుఁడ
సాక్షిరా! యింతయేలరా? । సాక్షివీవు
కావఁటర లేవఁటర! కనుల్ । గానవేర
వదరెదవదేలరా యోరి । పాటుఁబోత!

కర్ణ—నీవంటి పోటుమానిసులు నావంటిపాటుఁబోతులను నేటికిఁగనుఁగొనిరి. అమ్మపుట్టిల్లుమాట మేనమామకడనా దాచెదవు?

మీతండ్రిగారి శౌర్యము యిదివఱలోఁగాకున్నను యిప్పుడు బాగుగా తెలిసినది. అంతమంది యోధుల ముందు శిరంబునుఁబట్టి కోయుచుండ నాడు దానిలాగున నీతండూరుకొనెను గానివీరుఁడైనవాఁడూరుకొనునా?

అశ్వ—ఛీ! దురాత్మా! నీవదఱుఁబోతుఁదనమున నింకమాటల తోఁబ్రయోజనము లేదు. కాన నా మెడను కాలే నీకుఁ దగుసమాధాన మొసంగుఁగాక. (అని లేచుచున్నాఁడు)

(అందఱును వారించుచున్నారు.)

కర్ణ—(కత్తి దూయుచు) ఓరీ! బ్రహ్మచారీ! ఏదీ! మెడమ కాలు. దుర్బ్రిల్లి పడక నీశస్త్రమును జూడుము. బ్రాహ్మణహత్య నెత్తికిఁ జుట్టుకొనుట యెందులకని మిన్నకున్న కొలఁదియు నీచాపల్యము మేలు మీఱుచున్నది. నోరుమూసికొనుము.

అశ్వ—నా బ్రాహ్మణ్యమునుగూర్చి నీవు వెనుకంజ వేయనక్కఱ లేదు. నీకు బ్రాహ్మణభక్తి యింతగానుండఁ బట్టియే గురుజనతిరస్కార మునకుఁ బూనుకొంటివి? నీకీబ్రాహ్మణద్వేష మున్నంత కాలము నీకర్మ మింతే. తుచ్ఛా! బ్రాహ్మణుఁడ నని మిన్నకుంటివా? (జందెమును దెంపి) నా బ్రాహ్మణ్యమును బరిత్యజించితి నింకరమ్ము.

సీ. దీనితోఁగాని పార్థుని ♦ తీవ్రమా ప్ర
తిజ్ఞ భంగంబుఁగాదు నీ ♦ తిటతీఱఁ
బోదు మనకిర్వుఱకు పట్టి ♦ వాదమేల
ఖడ్గధాటిఁ జూపరచేవ ♦ గలిగియున్న.

లేకున్న నా ఖడ్గంబును నేలవిడిచి నా పాదములపైఁ బడుము?

(అనియిరువురు పోరుకొనఁబోవుటయు నందఱును వారించు టయు జరుగును.)

కృప—ద్రోణాయనీ! ముందుజరుగవలసినకథ యెంతయో యుండ నీయప్రస్తుతనాటక మెందులకోయి?

దుర్యో—ఆచార్యపుత్రా ! శాంతివహింపుము.

అశ్వ—మీరందఱు నన్నేల వారింతురు ?

గీ. ఈదురాత్ముని గడపిన ఽ నింతనైనఁ
గురుకులము బాగుపడు నమ్ము ఽ కొనుఁడు మీరు
గురుతిరస్కృతియే యింత ఽ కునుగతంబు
రావలదు అడ్డమీ ఖడ్గ ఽ రాజమునకు.

కర్ణ—రాజా! వారించుటకిది యదనుగాదు. తనకున్న క్రోధం బునన్యథా యుపయోగపఱచుకొన వలయునుగాని యిచ్చవచ్చినట్లు చెలరేఁగుటయా ? కాని వీనిదుర్మదమడంచితీరెద. వదలుఁడు.

అశ్వ—(విదలించుకొనుచు) ఓరాజా! కౌరవేశ్వరా! ఓమామా కృపాచార్యా ! మీరిర్వురు నిటులవారించుటచే యీదుండగీని కాయిర్దాయమును హెచ్చుఁజేయుచు లోకమున కెంతయో యపకారమొనర్చుచున్నారు.

కృపు—అబ్బాయీ! ఉపకారాపకారముల సంగతి పిమ్మటఁజూచుకొనవచ్చునుగాని, మనలోమనముఁ గలహించుకొనుట కిదిసమయమా ?

అశ్వ—అట్లయిన మామా !

గీ. బవరమునవీఁడు శాత్రవ ఽ బాణఁజిక్కి
చచ్చిననువార్త వినుదాక ఽ శస్త్రమిదిగో
వీడుచున్నాఁడ పోవుచు ఽ న్నాఁడ నెవ్వ
డవసరమొ రాజునాఁడె న ఽ న్నరయఁగలఁడు.

(ఖడ్గమును బాఱవైచి పోవుచుండ)

కర్ణ—పిఱికివార లాయుధపాణులైననేమి. క్రిందపాఱవైచినట్లే యర్థము.

(తెరలో)

గీ. ఏఖలుఁడు భీతిలేకుండ । నింతికొప్పుఁ
బట్టియీడ్చెను? మానిని । పుట్టములను
నొలిచెనో? మానధనులెల్ల । వలదటంచు
మొత్తుకొనుచున్నఁ గానియా । మూర్ఖుఁడిపుడు
నాదుభుజపంజరమునను । న్నాఁడువాని
గావఁగలిగిన వీరులు । గలిగియున్న
రండు! కౌరవసేనానులా । రా! వినుండు
వానివక్షస్థలంబును । వ్రక్కలించి
రుధిరమును మంటకోలఁదిని । గ్రోలుదంచు
చేసినప్రతిజ్ఞ నిపుడు దీ । ర్చెదను నేను.

అశ్వ—ఓ సేనాధిపతీ! సమయమువచ్చినది. కార్యశూరత్వ మిప్పుడు చూపించవలయును? వినుచుంటివిగదా? భీముని ప్రతాప వాక్యములను.

కర్ణ—విన్నాఁడను విన్నాఁడను. ఇంతియేగదా! ఈకర్ణునికంఠమునఁ బ్రాణములున్నంత వఱకు దుస్ససేనునిదెసకుఁ ఫాలాక్షుఁడేనియుఁ బోఁజాలఁడని నమ్ముము. ఓయువరాజా! భయపడకు మిదిగో వచ్చుచున్నాఁడను. (నిష్క్రమించును)

అశ్వ—రాజా! కౌరవేశ్వరా! అటుఁజూడుము:

గీ. ద్రోణ భీష్ములు చచ్చిరి । గాననింక
భయము లేదని యాభీమ । పార్థులెటులఁ
జెలఁగుచుండిరో యనిలో వి । చ్చలవిడిగను
వారి నెదిరింప శక్యమె । వ్వరికిఁగాదు.

గీ. కర్ణుఁడొక్కఁడు చాలఁడు । గాన వేగ
కదలిపోవయ్య తమ్ముని । గాచుకొనఁగ

విడవభీముని నదలింప వీలులేదు
సమయమునకుఁ జేరఁగదయ్య సాయముగను.

దుర్యో—ఆ! ఏమి. ఈసుయోధనుఁడు జీవించియుండఁగా నా సోదరుని దెసకుఁ బోఁగల్గుచేనా? ఓరీ! ఎవరురా అక్కడ? రథముసిద్ధపఱుపుము. (వణుకెత్తుఁచున్నాఁడు)

అశ్వ—(ముందునకుఁజూచి) మామా! ప్రతిజ్ఞమాట వెనుకఁ జూచుకొందము. నేనిదే కత్తిఁగైకొని రణంబునకుఱికెదను. సమయము మించుచున్నది. చూఁడు యాభీముని యాకారము !

గీ. కడుపుమంటఁ గొలంది యా గాలికొడుకు
దుస్ససేనునురమ్ము నా త్తురునుగ్రోలు
చుండుటయెగాకఁ బ్రేవుల దండగుచ్చ
మెడను ధరియించి యల్లదే మిట్టిపడెడి.

(తెఱలో)

ద్రోణాయని! చిరకాలమునుండియు ననుశ్రితముగా వచ్చుచున్న సత్యవ్రత దీక్ష కేలఁగళంకముఁ గూర్చెదవు?

అశ్వ—ఓహో! ఏమది! వారణోత్సాహమునకు దైవంబు గూడ ప్రతికూలముగా నున్నవాఁడు. మామా! ఇపుడేది కర్తవ్యము?

గీ. భీముఁడాగతి విచ్చల విడిగ సంచ
రించుచుండఁగ మనము స హించదయ్యొ
యేమియొనరించు వాఁడ నిఁ కేదిదారి
చెప్పఁగదవయ్య యీగొప్ప ముప్పుదప్ప.

కృపు—అబ్బాయీ! వేఱుదారేమియు లేదు. నీవుశిబిరమునకుఁ బొమ్ము. నేనుఁబోయి సర్వంబును నిర్వహించి వచ్చెదను.

అశ్వ—మామా! అట్లయినఁ ద్వరగఁబోదమురమ్ము.

(అందఱును నిష్క్రమింతురు.)



# వేణీసంహారము

## చతుర్థాంకము.

(వికృతాకారమున భీముఁడు ప్రవేశించును.)

ఓ కౌరవయోధులారా! పాఱిపోకుఁడు. పాఱిపోకుఁడు. నేను పెఱవాఁడను కాను. భీముఁడనే. మిమ్ములను జాలకాలమునుండియు నెఱింగి యున్న వాఁడనే. ఆనాఁడు మహాసభయందుఁ బాంచాలి జుట్టుపట్టుకొని యొకదుర్మార్గుఁ డీడ్చుచుండ మీతోడిపాటుగ నున్న వాఁడనే. కోకలనొల్చు నప్పుడుగూడ నుంటిని. ఇప్పుడు నా మొగమునఁ గ్రొత్తగా మొలచిన దేమియును లేదు. (చెవియొగ్గి) ఏమనుచున్నారో నాకు వినఁబడుటలేదు. అట్లయిన నీకీవికృతాకార మెటులవచ్చినదని కాఁబోలు మీ ప్రశ్న. నాఁడాసభయందుఁ జేసిన దారుణప్రతిజ్ఞానిర్వహణమే నా యీరూపమునకుఁ గారణము. ఈనాయొడలంతయుఁ బూయఁబడియున్న రక్తమంతయు నాయింతి కొప్పుఁబట్టి యీడ్చినవానిదే. ఈ ప్రేవులన్నియు నాయింతి కోకలొల్చిన యధమాధమునివే. మీరు పిఱికి పందలై పాఱుఁబోతులై యీగతిఁ బలాయనమగుచున్నను యీభీముఁడు మిమ్ము వదలువాఁడు కాఁడు. మీ కత్తులను, కటారులను పారవేయకుఁడు. వీరపురుషోచితలక్షణ మనుసరించి ముఖాముఖిని పోరాడి జయము నార్జించుటో, వీరస్వర్గమనుభవించుటో ఫలితముగఁ గనుఁడు.

రెంటికి జెడిన తేవదరీతిని మీరాజన్మములు వృథా గావించుకొనకుఁడు. ఇంతటితో నాప్రతిజ్ఞ పూర్తిగాఁ దీఱలేదు. నాకడుపుమంట యింకను జల్లాఱలేదు. ఆమదాంధీభూతచేతస్కుఁడు, రారాజునని మిట్టిపడెడు నాఖలుఁడు. మీప్రభువు దుర్యోధనుఁడు. తెలిసినదా? ఇంకను దెలియలేదా? విస్పష్టముగఁ జెప్పెదనాలింపుఁడు. ద్రుపదరాజసుతను తనతొడపైనిఁ గూర్చుండుమని కనుసన్నఁ జేసిన పాపాత్ముఁడు వధింపఁబడి వానిరక్తముఁగూడఁ జవిఁజూడఁబడువఱకు నీభీముని క్రోధము మాఱఁబోదు. అప్పటికిఁగాని వీనిహృదయము శాంతిఁజెందదు. అప్పుడుగాని పాండవసంతతియొక్క బాహుబలాతిశయంబులు చక్కఁగా లోకమునకుఁ దెలియును. అప్పుడే జయలక్ష్మి వెదకుకొనుచు ధర్మజుని పాదములకడఁ జేరుట. ఈవికృతరూపధారణకు శాంతి దుర్యోధనవధయే. దుర్యోధనవధయే. ఈప్రయాణమునప్పటికే. దుశ్శాసనుని వక్షస్థలంబును వ్రయ్యలు చేసి, రుధిరపానమొనర్చి, పేగులమాలికను ధరించునప్పుడెటుల సాక్షిభూతులై యామహోత్సవమును వీక్షించిరో యట్లనే దుర్యోధనవధావిధానముఁగూడ నవలోకించి యానందవారాన్నిధి నోలలాడుఁడు. ఆతనివధ మీకుఁగంటకముగాఁ గన్పడెనేని యచ్చటనే కూర్చుండి కన్నులమూసికొని మనగతి యిట్లువచ్చెనురా భగవంతుఁడా? యని విలపించుఁడు. ఏనోయొక్కపద్ధతి నవలంబింపవచ్చునుగాని పరుగిడనేల? ఓకర్ణా! అటుపరుగెత్తెదవేమి? నీపాలిటఁగాలయముఁడై వర్తించు పార్థుఁడచ్చటనేయున్నాఁడు. నీయునికి నన్వేషించుచున్నాఁడు. దుర్యోధనునితో పాటు నీయాయువుఁగూడ నేఁటితో ముగియుచున్నది. అరికులారణ్యచండదావానలులని విఖ్యాతిఁ గాంచిన పాండవులను నీవు కూసినకూతలు, నేటితో నంతమొందఁగలవు. నీవు నడపిన నాటకమంతకును నేటితో భరతవాక్యంబును జెప్పఁగలము. ఓరోరీ! శల్యా! పరుగెత్తకుము. నీశల్యముల నేఱుట నేఁడే!

ఎంతయో ప్రేమమునఁ జూచుకొనుచున్న దుశ్శాసనవియోగమును మీరెంతకాల మిట్లు భరియింపఁగలరు ? మీరు మీప్రేమమును వీడ నక్కరలేదు ? ఓరీ ! దుర్యోధనా ! నేను వచ్చులోపల నీయప్పగింత లన్నియుఁ బూర్తిఁజేసికొనుము ? నీతలిదండ్రుల నిప్పుడే కఱవుఁదీఱఁ జూచుకొమ్ము ? ఆనాఁడు ఐదూళ్లు బిచ్చమడుగుకొనుచున్నను గురు లింకను ముడువకుంటివేమే యని వదరిన నీప్రేముంపుటిల్లాలితోఁ దుది సంభాషణముఁ గావించుకొనుము? నీకున్న సమస్తాయుధములలో నాక ట్టెదుటఁ బ్రత్యక్షముగ నున్నే? అయ్యో! నిన్నుఁ దలఁచుకొన్న నాకొకింత జాలిగూడ గలుగును గదా? ఈలేనిపోని కయ్యంబుఁ బెట్టుకొని యిందఱి సోదరులను జంపుకొంటివి. వంశమునకు నీవొక్కఁడవే గదా! పాపము ముదుసలులగు నీతలిదండ్రుల కిన్నేళ్లు విడచెడి యాధారమవు. నిన్నైన వీడిన బాగుండునని యున్నది గాని మోహమూఢదుర్యోధనా ! నీక్రూ రచేష్టములైన, మాయద్యూతము, సతీపరాభవము, విషాన్నదానము, ఐసనుగాల్పించుట, గంగలోఁ ద్రోయించుట, వారణాసికంపుట, రాజ్య మపహరించుట మున్నగునవి స్మృతికివచ్చి నీయెడ నున్నజాలినంతను భస్మీభూతముఁ జేయుచున్నవి. నీకర్మమునకు నేఁ జేయఁదగిన సహాయ మేమియును లేదు. దేనికేనిఁ దిరుగున్నవిగాని యీభీముని ప్రతిజ్ఞ కటు లఁగాదు. ప్రతిజ్ఞావాక్యములోని ప్రతియక్షరమును నిర్విఘ్నముగా నెఱవేఱ తీఱవలసినదే (ఆలోచించి) ఓహో ! ఏమి? శాత్రవరుధిరా పానప్రమత్తహృదయుండనై కర్తవ్యముఁ నే మఱచితినే! ఈవేడిచల్లా రకమునుపే సర్వకార్యములను జక్కఁబెట్టవలసియున్నది. కాఁబట్టి జాగుచేయకఁ బార్థునికడకేగి వానిని వెంటఁదోడ్కొని యీనావిజయ వార్త నెఱిఁగించుచు, నన్ను నేను దెల్పుకొనుచుఁ బుత్రశోకముచేఁ గడుపుగగిలియున్న వృద్ధదంతులఁ బరామర్శించి యవ్వలఁ గొఱఁతపడి యున్న ప్రతిజ్ఞానిర్వాహణంబునకై గదంగొదఁగాక (అని ముందునకు

నడచిచూచి) ఓహో ! పార్థుఁడే యీదెసకువచ్చుచున్నాఁడు. వీనివలనఁ గొన్ని సంతోషకరవార్తలు తెలియఁగలవు.

[అంతనర్జునుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

భీము—అర్జునా ! శోభాయమానముగ నుండవలసిన నీవదన మేల దీనత్వమును సూచించుచున్నది ?

అర్జు—అన్నగారిచేఁ జీవాట్లఁదినుటవలన.

భీము—ఎందులకు ?

అర్జు—ప్రతిజ్ఞా పాలనముఁ గావింపకుండ నాతనిఁ జూడఁబోయి నందులకు.

భీమ—తమ్ముఁడా ! అన్నగారి కెంతటి యాగ్రహము వచ్చి నదోయి?

గీ. విసముఁ గుడిపించునప్పుడు ♦ బసనుగాల్చు
నప్పుడును గంగలోఁ ద్రోసి ♦ నప్పుడును న
మాయకులఁ జేసి రాజ్యర ♦ మాహరించు
నప్పుడును, నిండుసభ నింతి ♦ కొప్పుపట్టి
కోకలొలిచెడి నప్పుడు ♦ సూశలెన
కౌరవులపైని ప్రేమంబు ♦ గార్చినట్టి
ధర్మజున కిప్పుడింత కో ♦ ధంబువచ్చె
ననిన విపరీతముగఁ దోచె ♦ మానమునందు.

అర్జు—అన్నా వాయునందనా ! ఆయాగ్రహమునకుఁ గావలసి నంత కారణమున్నది. ఏదందువా ?

గీ. కర్ణుఁడెవ్వరు లేనట్టి ♦ కాలమందు
గాయపరిచెను మనయన్న ♦ గారి నద్ది
తెలిసికొని చూడఁబోవఁగా ♦ తీవ్రమైన
వాక్కులను బల్కి నన్నుఁ జీ ♦ వాట్లుఁ బెట్టె,

భీమ—అన్నగారి క్షమాగ్రహము యీరణాంతము వఱకుండిన నెంతో యందముగ నుండునుగదా? పోనిమ్ము. చివఱకు ఆపాంచాలిని దొడపైఁ గూరుచుండుమని కనుసన్నఁ జేసిన యాదుర్యోధనుని తొడఛేదించువఱకును, తన్నాదవభర్తగాఁ గైకొనుమని పదరినకర్ణుని వధాంతము వఱకును నిలిపినఁ జాలును.

అర్జు—కావలసిన పనులన్నియు ఘడియలమీద జరుగుచుండ నింక నాతని యాగ్రహమున్న నేమి? లేకున్న నేమి! చూడుడు.

గీ. రాధయో, కుంతియో పుత్ర । రహితయయ్యె
ననెడి వార్తను నేడు నీ । వినఁగఁజేతుఁ
గాని వేఱుగ నినుఁజూడ । రాను రాన
టంచు గురిమాలుగా వచి । యించినాఁడ.

కాన, నాప్రతిజ్ఞ నెఱవేర్చుకొనువఱకు నింక ధర్మరాజును చూడఁబోవనుగదా! ఇంక నీవో! నీప్రతిజ్ఞ పూర్తిగాకుండఁ బోవైతివి?

భీమ—తమ్ముఁడా! ఒక్క విషయమును గూర్చి నీతో ముచ్చటించెదను. నీయంగీకారమును దెల్పెదవా?

అర్జు—అన్నగారూ! అదియేమి?

భీము—నేనీ రూపముతోఁ బుత్రశోకతప్తులై యున్న వృద్ధదంపతులఁ జూచి రావలయునని యనుకొనుచున్నాఁడ నేమందువు?

అర్జు—వలదందునా?

భీము—మఱినీవుఁ గూడ నాతోడ............

అర్జు—పెద్దలగు తమపాదచ్ఛాయల ననుసరించుట మాకు విధియే కాని అన్నయ్యా!

గీ. నేనుఁగూడ నీవలెనాఁడు । నిండుసభను
బ్రతినఁ గావింపలేదె? స । ప్రతినయందు

నగముదీఱెను అదియును । సంభవింప
దయ్యె నాకిప్డునిన్నట్టు । లనుసరింతు.

కాన, నామాట విని కర్ణునివధానంతరమువఱకుఁ దాళిన నటులనే గావింతము.

భీము—అవును నీయాలోచనము చాల బాగుగా నున్నది. అటులనే చేయుదము. మన మిప్పుడెటకుఁ బోవలయును ?

అర్జు—అన్నా ! ఇంతలో మఱచితివా ?

భీము—ఆఁ లేదు, లేదు. మఱువ లేదు. ఆరుధిర పానము వల్లఁ గలిగిన హొత్తు మధ్యమధ్య నాకొకింత హడావుడిఁ గలుగఁ జేయుచున్నది. కర్ణుని వధ కేగదా?

అర్జు—అవును,

భీము—సకలము నెఱింగిన నీకు వేఱుగఁ జెప్పఁబని లేదుగాని పెద్దలమగుటఁ దప్పదు. ప్రతిజ్ఞా నిర్వహాణంబున శ్రద్ధగా నుండవలయును జుమా?

అర్జు—అదియంతయు శ్రీవాసుదేవుని కటాక్షముపై నాధార పడియున్నది.

గీ. వాని యండ లేనిది మన । వలననేమి
యగును యీనాటకంబున । కతఁడె సూత్ర
ధారియై యిట్టిమనలఁ బా । త్రములఁ జేసి
యాటనాడించుచుండఁగా । లోటుఁగలదె.

భీము—అటులైన మనమింక జాగుసేయనేలఁ బోదమురమ్ము.

(ఇరువురను నిష్క్రమింతురు)

---



# వేణీసంహారము

## పంచమాంకము

(మూర్ఛపడియున్న దుర్యోధనుడు, సూతుడును)

దుర్యో—(లేచి కూర్చుండి) సూతుఁడా! ఎంత విపరీతము జరిగినది? హా! తమ్ముఁడా, దుశ్శాసనా?

ఉ. ఆయువుసిండెనే యపుడె । అక్కట యొక్కవుసుంత, యేమి య
న్యాయము, యేమి దెల్పుదిపు । డమ్మరు నమ్ముడు నిన్నుగూర్చి ని
స్స్వాయతుణంబయో నను మాఁ । బల్కన పల్కులనేమి చేసినా
వోయి! ముఁకేరిఁ జూదమునకాసి । యుద్ధముఁ ర్పదనయ్యా తమ్ముఁడా!

గీ. కౌరవపురవంత సంతతిని । గోటుపురండు
కొప్పుఁబట్టి యీడ్చుట యందు । కోకలొల్చు
టందు నీధైర్యమును మఱి । మండుటట్లు
వైరులకు పరిభవంబుచే । కూరుటట్టు
గలరె? నినుఁబోలు ధైర్యవం । తులు జగాన.

హా! హతవిధీ! నీవింతటి యన్యాయమునకుఁ బాల్పడు చుంటి వయ్యా? ఇంత కృపావిరహితుఁడవని యెఱుంగక పోతిమిగదా! పోనిమ్ము. నీయాటనే సాగనిమ్ము.

గీ. ఇంతఁజేసినవాఁడ విం । కెంత యేని
చేసితీతాద విద్ధి ని । శ్చితముగాన

పాపుఁడగు భీమునకాతఁ డిక ౹ బడఁగనీక
హతవిధీ! నాకు యీవయస్య ౹ స్మృతిని వేగ.

సూత—దేవా! తమనోటివెంట నిట్టిమాటలు రాఁదగునా?

దుర్యో—సూతుఁడా! నాకేమున్నది చూడుము?

గీ. బంధుగులనెల్ల రణమున ౹ బలిగనిచ్చి
యిటులనేకాకినైన నా ౹ కింక నేల
రాజ్యకాంక్ష వైరులతోడి ౹ రణముజయము
అన్నివిధముల భ్రష్టుఁడ ౹ నైతినిపుడు.

(సుందరకుఁడు ప్రవేశించుచున్నాఁడు)

సుంద—ఎందు వెదకినను దుర్యోధనమహారాజు గాన్పించకుండె నింక నేనెచ్చట వెదకెదను? ఇచ్చటఁగూడ లేనట్లుగా నే గాన్పించుచున్నది. (ముందునకుఁజూచి) బహుశః ఆగుంపుకడ నుండవచ్చును. పోయిచూచెదఁగాక (కొంచెము నడచి) ఓ యోధవరులారా! అందు దుర్యోధనమహారాజగారున్నారా? (చెవియొగ్గి) ఏమనుచున్నారు? లేరనియా! సరే మఱియొక చోటికిఁబోయి చూచెదను (మఱికొంత దూరము నడచి) ఇక్కడఁగూడ నా యాశ భగ్నమైనది. (ఇంకొకచోటికరిగి) ఓ అయ్యలారా! కురునాథునిజాడ మీకేమైనఁ దెలియునా? అయ్యో! నా ప్రశ్నమునకు సమాధానముగా వారందఱు నన్నుఁజూచి యాతీఱునఁ బలాయనమయ్యెద రేమి? అదిగో; అచ్చోట నొకముసలియవ్వ గాన్పించుచున్నది. ఆమె నడిగెదను, (కొంతదూరముఁజని) అడుగుటకు సమయము గానున్నటులుఁ గాన్పడదే! ఆబిడ విధానమంతయు వేఱుగనున్నది. కాన నీయవ్వవలనఁ బ్రయోజనము లేదు. కాని యీవిధానము మాత్రము నాకచ్చెరువుఁ గొల్పుచున్నది. తనకుమారుఁడు మహాహవరంగంబున గూలుటాలించి సహగమనాచార మవలంబించు తనకోడలితోఁగూడఁ జితిఁ బ్రవేశించుచున్నయది. ఆహా! లోకమంతయు నిట్టివీరమాతలతో

నిండిపోయిన సిథరతఖండములకు నింక లోపమేమున్నయది. ఈతలంబులన్నియు వెదుక నేల? అనుగో యొక యరదంబు గన్పించెడిని అది తప్పక దుర్యోధనమహారాజునకే చెందియుండును. అచ్చోటికిఁ బోయెదను. (అని చేఱువకుఁజని) జయముజయము. మహారాజా!

దుర్యో—సుందరకా! యుద్ధవార్త లేమి?

సుంద—శారీరమాత్రవైభవుండయి యంగరాజున్నవాఁడు.

దుర్యో—అదేమిరా! సరిగాఁజెప్పుము?

సుంద—దేవరవారు దుశ్శాసనవధను గూర్చివినియేయుందురు. ఆదారుణవధనుఁగాంచి పట్టరానికోపంబునఁ గర్ణుండు బాణవర్షంబును గురిపించుచు భీమసేను నెదుర్కొనియెను. భీమకర్ణులకు జరిగిన రణంబును వర్ణించుట కాదిశేషునకైన నలవిగాదు. వీరియువురకు జరుగుచున్నపోరతిభీషణాకృతిఁ దాల్చినందున శ్రీకృష్ణసహాయుఁడై పార్థుఁడు భీమునిపక్షమునను వృషసేనకుమారుఁడు సారథిద్వితీయుఁడగుచుఁదన తండ్రిపక్షమునను బాసటయైవచ్చిరి. మనవృషసేనకుమారుఁడు యీయాదునకుమించిన మేటిపరాక్రమవంతులతోఁ దనని జభుజపరాక్రమమును జూపుచుఁ బోరుచున్నందున నిరుపక్షములవారును వానిబాహుబలసంపదనుగూర్చియుఁ, దెలివితేటలనుగూర్చియుఁ, జాకచక్యమునుగూర్చియుఁ, జాఱుకుఁదనమునుగూర్చియు ననేకవిధములఁ గొనియాడిరి. కాని యేమిలాభము. దేవా! ఇఁక మనము వృషసేనకుమారుని చూడఁ బోముగదా! దేవా!

దుర్యో—హా! వృషసేనకుమార! రాధేయకుల పవిత్రా !

గీ. తండ్రికొఱకయి నీ సమరార్థ మెల్లఁ
జావిమెప్పులఁగాంచి నీ రూపుమాపు
కొనినవాఁడవు నీతండ్రి ఋణముఁదీర్చు
కొనినవాఁడవెంతని మెచ్చు కొనదనిన్ను.

గీ. సరిగ మోసము రాలేదు శశినిబోలు
ముఖము నాకెల్ల వేళల ముద్దువచ్చు
రాదు మఱపు నీరూపము లేదు మాకు
నిన్నుఁబోమఱి సంతసిం చెడుఋణంబు.

నాయనా! వృషసేన! నీవేమో యే పుణ్యాదమున నిర్భాగ్యుఁడగు రాధేయునకుఁ గొమరుఁడవై పుట్టినందులకు ఫలమిది. అటులఁగాక నావిధి నిన్నే పేదవానియింటఁ బడవైచినను?

గీ. కలియొ గంజియొ త్రాగుచు కడుపువైనిఁ
జేయువైచుక సుఖముగాఁ జెలఁగుచుండి
కడకు నూత్రేడులైన నీ పుడమిమీఁద
మనెడివాఁడవుగద యిద్ధు? తనయ నీవు.

సూతుఁడా! దుఃఖమునకుఁగూడ పరిమితియున్నదిసుమా? నాకర్మమేమి యోకాని నాజన్మమంతయును విచారముతోడనే గడచిపోవుచున్నది. పాపము. నామూలమున రాధేయుఁడుగూడఁ బుత్రశోకము ననుభవింప వలసివచ్చె. పుణ్యమునకుఁబోవఁ బాపమెదురయ్యెననులోకోక్తి కిది యేకాబోలు నిదర్శనము. నేనింక రాధేయుని మొగం బేమొగముఁ బెట్టుకొని చూడఁగలను? (కర్ణునుద్దేశించి) రాధేయా! ఈసుయోధనుఁడు నీకు శత్రుఁడుగాని మిత్రుఁడుగాఁడు సుమీ? సుందరకా! పుత్రశోకపరితప్తుఁడైయున్న కర్ణుఁడిందులకుఁ బ్రాయశ్చిత్తముగ వైరులకేవిధముగనైన సమాధానముఁ జెప్పవా?

సుంద — మిన్నకుండఁగలఁడా దేవా! ఈసమయమునం దుపేక్ష జేసిన మఱల రాధేయున కింతటియాగ్రహము వచ్చుసమయముండునా? ప్రాణములపై నాసరోసి యాపాండవసైన్యంబుపై కుఱికెను. కాని రథంబువిఱుగుటయు, గుఱ్ఱములుచచ్చుటయు, శల్యునివలన నెఱింగి వేఱొక యరదంబును గొనిరమ్మని సారథినిఁ బంపుచు నాకీలేఖనిచ్చి

తమకీయవలసినదని సెలవిచ్చిరి. ఇంతియ వృత్తాంతము. (అని ప్రత్యుత్తర మిచ్చుచున్నాఁడు.)

దుర్యో—(చదువుకొని) సుందరకా! ఈయుత్తరమువలన నాతఁడాత్మవధయందు కృతనిశ్చయుఁడై యున్నటుల స్పష్టపడుచున్నది. వేగముగా నీవుపోయి యిట్లని చెప్పుము. సఖా! కర్ణా! నీవింక జయకాంక్షను విడనాడుకొనవచ్చును అంతియగాక నీరణమొనర్ప సంకల్పించుకొనుటలో మనమిరువురమేకదా యేకాభిప్రాయులమై మెలంగితిమి? కాన నీవును నేనును తుదిసారి కౌఁగిలించుకొని యింత యేడిచి యీతనువులనుత్యజించెదముగాక. వృషసేనకుమారునిఁగూర్చి నీతోడిపాటుగా సమానదుఃఖము ననుభవించుచున్న నేను నిన్నేమని యూరడింపఁగలను? సకల కార్యములయందును నీతోడిపాటుగ నండయై సహాయపడిన యనుంగుసోదరుఁడగు దుశ్శాసనుఁడు నాకుతమ్ముఁడుగాఁ బుట్టనే లేదనుకొని దుఃఖమును దిగమ్రింగలేదా? అట్లనే నీవుఁగూడ వృషసేనకుమారుఁడు నీతనూజుఁడు గాఁడని దుఃఖమును దిగమ్రింగుము. ఆపాపపువిధి మన కననుకూలుఁడైనపుడు మనము చేయఁగల్గినదేమున్నది? ఇంతపట్టును నాతోఁగూడ సమాన సుఖదుఃఖములను పొందిన నీవిప్పుడు వెనుకకుమఱలిన యాత్రి మేమిప్రయోజనము?" అని నావలుకులుగాఁ దెలియఁబల్కుము.

సుంద—చిత్తము. మహారాజా! సెలవు. (నిష్క్రమించుచున్నాఁడు.)

దుర్యో—(వినుట నభినయించి) సూతుఁడా! ఏదియో రథము వచ్చుచున్నట్టుల సందడియగుచున్నది. చూడుము?

సూతు—చిత్తము (అని వెడలి మఱలఁ దొందరగాఁబ్రవేశించి) దేవా! నాయనగారును, అమ్మగారును, సంజయునిసహాయముతో రథమెక్కి వచ్చుచున్నారు.

దుర్యో—సూతుఁడా !

గీ. తమ్ముగమి మ్రింగివైచితి ౯ దగుదునంచొ
కండ బ్రతికితి నేమని ౯ గడుముదుసలు
లైన తలిదండ్రులనుజూతు ౯ గాన రథము
తెమ్ము కొంటనేని దాగెదఁ ౯ బొమ్ము వేగ.

సూతు—దేవా! అట్లొనర్పుట పాడియా ? చిపటికు మింగిలిన తమరొక్కరైనను వారికన్నులఁబడి యాదరించకపోయిన నింక వారు జీవింపఁగలరా?

దుర్యో—సూతుఁడా ! అదృష్టహీనుఁడ.

గీ. వలదనుచు మొత్తుకొన్న పీ ౯ నులను జేర్ప
కుండ నీపాపుయుద్ధం బొ ౯ కండుఁ బెట్టి
సకలమగు బంధువర్గ నా ౯ శమ్మొనర్చి
బ్రతుకుచున్నాఁడ జీవచ్ఛ ౯ వంబనగుచు.

కానవారి మొగంబుఁజూడఁజాలఁ జూడఁజాల. ఐనను తలిదండ్రులు దైవతుల్యులగుటచే నట్లనే యొనర్తము

(అంతరథారూఢులైన సంజయసహాయుము తో వృద్ధదంపతులగు ధృతరాష్ట్రుఁడును గాంధారియుఁ బ్రవేశించుచున్నారు.)

సంజ—నాయనా ! అమ్మా ! మనసుయోధనుఁడొక్కఁడు నా వృత్తచ్ఛాయను విశ్రమించియున్నాఁడు, నెమ్మదిగా దిగివచ్చెదరా ?

(ఇద్దఱు నెమ్మదిగా దిగి కూర్చుండుచున్నారు.)

సంజ—సుయోధనమహారాజా! నీతలితండ్రులు వచ్చియున్నారు. వారితోడ మాట్లాడుము దేవా !

దుర్యో—సంజయా ! ఏమిమాట్లాడెదను ?

గాంధా—అట్లనెద వేమినాయనా! శరీరమునందస్వస్థతగానున్న దా?

బడలికగానున్నదా? పోనిమ్ము. తమ్ములున్నారుగదా? వారైన మాట్లాడదరు లెమ్ము?

దుర్యో— అమ్మా! ఏమని పలుకరింతును

గీ. చేతులారంగ నర్పణఁ జేసినాఁడ
దారుణరణంబునందు నా తమ్ముగమిని
భరతసంతతి రూపుమాపంగఁ బుట్టి
నాఁడ జేతులఁ గడ్గుకొన్నాఁడ తుదకు॥

ధృత— నాయనా! తమ్ములందఱును గూలినట్లేనా? కుమారా! నూరుగురుపుత్రులకు మిగిలినవాఁడవు నీవొక్కఁడవేనా తండ్రీ! నీవైన నాకిన్ని నీళ్లచుక్కలను వదలి మమ్ముల సంతృప్తిఁ బఱుపుము పుత్రా!

గాంధా— కుమారా! ఇంతటివాఁడవైన నీశరీరంబును గట్టిపెట్టి పెద్దలమగు మాముప్పును గడుపుమురా తండ్రీ!

దుర్యో— అమ్మా! రాచపుట్టువుఁ బుట్టిన క్షత్రియునికిని శౌర్యము గ్గుపాలతోఁ బోయఁబడినదే గదా? క్షత్రియుఁడగువాఁడు సర్వకార్యములును శస్త్రముతోఁ దీర్చుటకు సిద్ధుఁడై యుండవలసిన విధియై యున్నది. సరే; అమ్మా! ఈమొదలగుహితులతో నిప్పుడు దమ్ములఁ దృప్తిఁ బఱుపఁజాలనుగాని తమ్ములనందఱిని పొట్టఁబెట్టుకొని యేకాకినై యుండి జీవితమును గడుపుచున్న యీకులనాశకునిపై నీకింత ప్రేముడి యేమమ్మా? ఇంతమంచిసోదరులపాలిటిమారకుఁడైన యాభీమసేనహతకుని రూపుమాపనిదే నాకీ దుఃఖపుమంట యెటులఁ జల్లాఱఁగలదు? ఇట్టు లేకాకినై యేమని యీరాష్ట్ర రాజ్యభారమును నెత్తిఁ గట్టుకొని యేలఁగలను? తల్లీ! ఈఖలునిపైఁగల ప్రేమచే నేమేమో యనెదరుగాని వీరికిఁ గలుగఁజేసిన దుర్గతికిఁ దగు ప్రాయశ్చిత్తముఁ గావింపరేమి? దూషింపరేమి? నిర్ఘాతపాతసదృశంబులగు మీశాపవాక్యములఁ బ్రయోగింపరేమి? ఈకాఠిన్యమును నాపైఁ జూపలేరు. చనిపోయినతమ్ములపైఁ జూపె

దరు. అమ్మా! అంతదారుణకృత్యమున కొడిఁగట్టుకొనుటయేగాక మన యసమర్థత్వమునుగూర్చి వైరులు నవ్వుకొనుచున్నారు. ఆవిధంబున మదాంధులైవిచ్చలవిడి చెలరేగుచున్న తుచ్ఛులనుగూల్చి వచ్చితిననుసంతోషవార్త విననిదే నామాటనట్లుండనిండు. మీకీ శోకానలము చల్లారుటెట్లు? కాన నాప్రార్థనమాలించి నన్ను రణవిముఖునిఁ జేయకుఁడు. నాయందలియాశవీడుఁడు. ఈ పాపకర్ముఁడు మీకుఁ బుత్త్రుఁడై జన్మించనే లేదనుకొనుఁడు. అమ్మా! నాయనా! సోదరవియోగమును భరింపఁ జాలను. భరింపఁజాలను.

గీ. తమ్ములనుగూల్చినట్టి పాతకులద్రుంచి
కడుపుమంటార్చుకొనుటయో గాక శత్రు
మండలికిఁ జిక్కి రణమున మ్రింది తమ్ము
గమినిఁజూడంగఁ బోవుటో కావలయును.

(అని రోదనము చేయుచుండ)

ధృత—నాయనా! నీవు చెప్పినదంతయు బాగుగనేయున్నది. కాని నిన్నుఁ జూచుకొని స్థిరమైన మాదుఃఖమును మ్రింగివేయవలయునని యాశతో నుండ ముదుసలులమగు మాయాశనేల నేలపాలుగావించెదవు? ఈసమయంబున మమ్ముల నోదార్చువారెవరు తండ్రీ!

దుర్యో—తండ్రీ! మిమ్ములనోదార్చువాఁడను నేను కాను. వేరేకలరు.

గీ. కుంతిపుత్త్రులనిపుడేను గూల్చివత్తు
నేనియాబిడఁగూడ యిట్లు విచార
వహ్నిలోఁబడి యిచటకు వచ్చునేని
యూరడించుకొనఁగవచ్చు నొకరినొకరు.

గాంధా—కుమారా! ఇదుగో నేను తల్లిని. బ్రతిమాలుకొనుచున్నదానను. వినుము. మనకిఁక సమరంబువలదు. రాజ్యకాంక్ష వలదు. ఇంతటితో శాంతింపుము.

సంజ— పెద్దలగు తలిదండ్రులయాజ్ఞ శిరసావహించుటధర్మము. తలిదండ్రులన దైవతుల్యులు. లోకజ్ఞానముంబూర్తిగా నెఱింగిననీకు నే నెక్కువగాఁ దెలుపఁదగిన విషయము లేమియును లేవు. కాన సమర మింతతోఁజాలింపుము.

దుర్యో— (కోపముతో) సమరమును జాలించి శాత్రవులకుఁ బాదాక్రాంతుఁడను గావలయునని నీయభిప్రాయమా ?

ధృత— నాయనా ! నీకుఁగోపమెందులకోయి ? నివుశాత్రవు లను శరణము వేఁడనక్కఱలేదు. పాదాక్రాంతుఁడవు గానక్కఱలేదు. వినుము?

గీ. ధర్మజుని బిల్చి యుద్ధమింక తటితోఁజాలు
యేలుకొనుమయ్య యిదరాజ్య మిచ్చరీతి
నిపచింపుచుమిగిలిన యట్టిరాజ్య
మేలుకొనవయ్య శాంతి వహింపుమయ్య.

దుర్యో— తండ్రీ! ఈసమయంబున నట్లొనర్చుటయొక్క యను చితమును మీరెంతమాత్రమును గ్రహింపరైరి. ఈయొక్కను గ్రాఁడువు బ్రదికించుకొని వీనితో నుట్టిఁగట్టుకొని యూరేగవలయునని మీకు న్నది. మీరుచెప్పినవిధాన మేనిప్పుడనుసరింతునేని నేనెంతటి లోకాప వాదను నోఁదలఁ ధరి వవలసివచ్చునో తెలియునా ?

గీ. పాండవుల పక్షమూని కృష్ణుండు నాఁడు
వచ్చి బ్రతిమాల సూదిమోపంగఁదగిన
వసుధ నేని నీయనటంచు బలికి, యిప్పుడు
తగుదునని సిగ్గులేక యే మొగముతోడ
నిచ్చెనని నేలఁ జేయు భరింపఁగలనె.

సోదరశతంబుతో నిందుసభలో నతిఠీవిగాఁ గూర్చుండి యటులఁ

బలిసి నూరుగురు తమ్ములను, ఆ తటి మహాయోధులను పొట్టఁబెట్టి
కొని యీపాపశరీరమును నిలుపుకొనఁదలంచి ధర్మజుని బిలచి ?

గీ, ఏలుకొనవయ్య ! ఐదూళ్లు నిచ్చెనేని
శరణమంటిని యింతటఁ జాలు రణము
కలియుదము యుద్ధము కట్టఁ గట్టుకొనుచు
నని వచింపఁగ మన మెటు లను మతించు.

తలిదండ్రులారా ! మీకొక రహస్యమును జెప్పెద నాలింపుఁడు.

గీ. ఒక్కరును జిక్క చెదరక యుండిరి వారు
భ్రాతృశతమును బాసిన వాఁడనేను
వారికిని నాకు సంధియే ర్పాటు లెటుల
కలుగు, శోకానలంబెట్లు తొలఁగు జెపుడు.

అంతియుగాక నేనిప్పు డీదురుద్యోగమునకుఁ గాలూనినచో ధర్మజుఁడు
నన్నుహీనునిఁగాఁ దలంచియే తీరునుసుఁడీ?

ధృత——నీకాభయమావంతయును వలదు. చూఁడు ?

గీ. పెద్దవాఁడను వాఁడెప్పు సుద్దులెల్ల
తప్పకుండ వినియె తీఱు ధర్మరాజు
అంత మాత్రనహీనుఁడ వంచుఁదలచి
గేలిసేయఁడు నిదగు కీర్తి బోదు.

అంతియు గాక వాఁతఁడు తన కంటె నిన్నే యధికునిగా ప్రేమించఁ
గలఁడు.

దుర్యో——అది యెట్లు తండ్రి!

ధృత——కాలమెప్పుడును నొక్కరీతిగ సాగి రాదు. జయాప
జయంబులు దైవాధీనంబులు. జయమెదిరిపక్షమునే వరించునో స్వప
క్షమునే యెదిరించునో యను భయము మొదటినుండియు ధర్మజు
నకుఁగలదు. అందుచేతనే తనయనుజులం దెవ్వరు కూలినను మిగిలిన

వారందఱుఁగూడఁ బ్రాణములఁ బాయునట్లుగనే వారుప్రతిజ్ఞలు గావించుకొనిరి. కాన దర్పక ధర్మనందనుఁడు నామాట వినఁగలఁడు. వానినొప్పించు భారము నాయది.

దుర్యో—ధర్మనందనునియాధిక్యత యీమాటల వలననే తేటపడుచున్నయది. అందుచే నేనెందును నాతనికి సాటియేరాను. ఏమందురా? ఒక్కఁడు కూలినంతమాత్రముననే మిగతవారందఱును బ్రాణపరిత్యాగముఁ గావించుకొన శపథమును వారుపట్టిరి. నూరుగురుతమ్ములొక్క పెట్టున రణంబునకు బలిగ సమర్పింపబడినను గాజులు దొడిగించుకొనిన యువిదవలె నూరకునియాతుచ్ఛశరీరమును నిల్పుకొంటిని అంతియగాక, నాభీమసేనహతకుఁడు దుస్ససేనునిరుధిరంబును గడగడ ద్రాగుచుండు నప్పుడైనను చేతవాతగాని చచ్చుదద్దమ్మనై యేవిధముగు ప్రతిక్రియయుఁ జేయఁజాలనైతిని. వానికంటెనా కాధిక్యమేమిగలదని?

ధృత—కుమారా! నీవు నీరోషమును వీడవైతివి. మాకు దుఃఖోపశమనముఁ గావింపవైతివి. ఎట్లుకొట్టుకొందుము? తనయా!

గీ. అంధులము మేము సుతులను యందఱిని ర
ణావనికి నిచ్చుకొంటిమి అయ్యో! యొకఁడ
వేని యున్నాఁడవంచు మే మింతొ యాశఁ
జెందఁగా దాని నీవు ద్రుంచెదవదేల.

వృద్ధులమగు మాకింకదిక్కెవరురా తండ్రీ?

దుర్యో—తండ్రీ! నాకిపుడురణముకంటె వేఱుకర్తవ్యమేదియుఁ గానరాదు. పుత్రులమైన మేమనుభవింపవలసిన సకలసుఖంబుల ననుభవించిన వారమే కాని సామాన్యులముకాము. అంతియగాక నాసోదరులిపుడు వీరస్వర్గంబున హాయిగా నున్నవారు గాని వేఱుగతిఁ జెంది యుండలేదు. వారు తమతమ బాహుశక్తిని రిపుతండమునకుఁ జూపిరి. విధిప్రతికూల్యముచే మడిసిరి. నేనరులగెల్చి విజయలక్ష్మిని సంపాదిం

చితివా? మీ కాధారకుఁడవే గదా? ఒకవేళ నన్యథాజరుగు నను కొ
నుఁడు. కానిండు. దైవనిర్మాణమున కెవ్వఁడును నడ్డులేదుగదా? లోకమున నందఱును సుతులతోడనే కులుకుచున్నవారా? సంతానవిహీనుఁడైన సగరచక్రవర్తి కాలముసుఖముగా గడుపలేదా? వానికంటె మన మేమంతి యెక్కువైన వారము. కాన నీవు నాతలంపున కన్యథాతలంపకుము. తండ్రీ! మీపాదములపై వ్రాలెదను.

(తెఱలో)

ఓ కౌరవయోధులారా! సుయోధన మహారాజెందున్నవాఁడో తెలుపుఁడు. అంగమహీపాలుని మృతివార్త వేగముగాఁ దెలిపినఁ బ్రతివిధాన మాలోచింపఁగలఁడు?

అందఱు (వినుట నభినయించి) హా! కర్ణా! నీకుఁగూడఁ చివఱకీ ఫలితమే యబ్బినదా (రోదనముఁ జేతురు)

దుర్యో—హా! వయస్యా! కర్ణా! ఈపాపాత్మునికొఱకు నీవు గూడ వ్రాలితివా? ఎంత దురదృష్టవంతుఁడను. నమ్మకుని నన్నింత కాలముకొలిచినందులకు, నాకుఁ బ్రాణసఖుడవైనందులకా? నేను జూపిన ఫలితము. నీకుమారునియొక్కయు నీయొక్కయు ప్రాణంబులు రణభూమి కిప్పించుటయేగదా? ఛీ! ఛీ! మూఢదుర్యోధనా! ఇంకేల బ్రదికెదవు. చూడు?

గీ. చచ్చెఁగద యుద్ధమందున శాంతనవుఁడు
ద్రోణుఁడును చచ్చె; సదునూర్వురు సహోద
రులును గూలిరి, చచ్చెఁ గర్ణుఁడును నేఁడు
యిందరిని జంపుకొనిన నీ వేలమనెదు.

సఖా! అంగమహీపాలా!

గ. క్షణమాయేనియు విడనాడు టనిననొక్క
యుగముగాఁ దోచెడినయో సుయోధనా యు

టంచుఁ బల్కెదు గద, పల్కె | రించవేమి
మఱపు వచ్చెనె వెనుకటి | మాటనీకు.

మిత్రమా! కుమారునిపైఁ బ్రేమమును వీడలేక పోతివా? సర్వవిధముల నీవదృష్టవంతుఁడవే. నేనే పట్టి నిర్భాగ్యుఁడను.

గీ. కొడుకుపైఁ బ్రేమమును వీడు | కొనఁగ లేక
క్షణములోఁ జేరితివి వానిఁ | గలిసికొనఁగ
నూరుగురు సోదరులు నాకు | దూరులైన
వారిఁ గలువంగఁ బోనైతిఁ | బాపినైతి.

హా! వయస్యా! నీవియోగము నే నెటుల భరింపఁగల్లుదునోయీ?
(మూర్ఛిల్లుచున్నాఁడు)

ధృత—సంజయా! కుమారుఁడు మూర్ఛిల్లియున్నాఁడు. చూడుము?

సంజ—మహారాజా! ఊరడిల్లుము.

దుర్యో—(లేచి కూర్చుండి) సంజయా!

గీ. నా బహిఃప్రాణమగుచును | నాకుఁ గుడిభు
జంబగుచు నింతదాక క్ష | ణంబయేని
వీడి యెఱుఁగని కర్ణుని | వీడి యేటుల
నూఱడిలువాఁడ భూమిపై | నుండువాఁడ.

గీ. నా సహోదరులెల్లరు | నన్నుఁ బాసి
పోయినను; అంతయోధులు | పోయినను భ
టావళి రణంబునందుని | హతులైన
యింత దుఃఖంబుఁ జెందినే | నెఱుఁగనైతి.

గాంధా—నాయనా! ఇంక నడలకోయి పుత్రా?

ధృ—ఓ మాయదైవమా!

గీ. కండ్లు లేకుండఁ జేసి, మా | కన్న సుతుల
నందఱిని గూల్చియిది చాల | దంచు నెంచి

యేమి చేయింతువద్ది చే । యింపుమయ్య
వీని మొదఁగూడ నాసను । వీడుకొంటి.

గీ. ఎన్ని దన్నుగడలు । ఎన్ని విచిత్రాలు
ఎట్టి నాటకంబు । లెంతయుద్ధ
మింత కీవగావ । యీశ్వరా! కారణ
భూతమింక నేమి । చేతువయ్య.

దుర్యో—సంజయా ! యీ ఘోర కార్యము నెవరొనర్చి యుందురు? పాపాత్ముఁ డాయర్జునుండే కావచ్చును.

సంజ.—అందు విపరీతమేమున్నది ? అర్జునుఁడు తనప్రతిజ్ఞను నెఱవేర్చుకొన్నవాఁడు.

దుర్యో—సంజయా !

ఆ. వె. శశిని ధిక్కరింపఁ । జాలెడిమోమును
చారెడంతకనులు । చెప్పనలవి
కాని భావలీలముఁ । గల్గిన కర్ణుని
రూపమూని యెట్టు । లుండఁగలను.

కావున నేనింక వాలమొనర్పఁబోను. తల్లిదండ్రులారా ! నాకాజ్ఞనిండు. సూతుఁడా ! వేగంబుగా రథంబును సిద్ధపఱుపుము ?

సూతు—చిత్తము (అని నిష్క్రమించుచున్నాఁడు.)

ధృత—నాయనా! రణంబునకే నిశ్చయించుకొంటివేని, మాకింకను గడుపు చిచ్చుఁబెట్టఁదలఁచుకొంటివేని యున్నవారిలోనే తగిన వాని నెవ్వనినైన సేనాధిపతిగ నభిషేకింపుము?

దుర్యో—ఇంక సేనానులెందులకు ? సర్వంబును నేనే నిర్వహించుకొనియెదను. ఇదే గదామాత్రసహాయుండనై పోయెదఁగాక.

(తెఱలో)

ఓ కౌరవయోధులారా! కురురాజెందున్నవాఁడు. వారి వదనారవిందముఖ తూరి చూచి పోవచ్చినారము.

సూతు—దేవా! భీమార్జునులు రథమెక్కి వచ్చుచున్నారు?

(అందఱును భయము నభినయించుచున్నారు)

దుర్యో—అమ్మా! నాయనా! సంజయా! సూతుఁడా! మీకింత పిఱికితనమేల? గదాధారినై సిద్ధముగనే యున్నాఁడను. రానీయుఁడు! కాని అమ్మా! నాయనా! మీరింక శిబిరములకుఁ బోరాదా?

ధృత—వీరియుద్యమమేమో యెఱింగిపోయెదము.

(అంత భీమార్జునులు ప్రవేశించుచున్నారు)

భీము—ఓ పరిజనులారా! మా మొగముల నేమున్నది? వికలి చూపులఁ జూచెదరు. భయపడకుఁడు.

గీ. బసను కాల్పించుటే గాక | విసముతోడ
చంప యత్నించుటే గాక | సాధ్వి కొప్పుఁ
బట్టి యీడ్పించుటే గాక | కట్టుకొనిన
బట్టనొలిపించుటే గాక | బానిసలుగ
బాండవులఁ జేయుటే గాక | వాసుదేవుఁ
గట్టయత్నించుటే గాక | కపటజూద
మొందు కల్పించుటే గాక | నున్నయట్టి
రాజ్యమూడ్చుటయే గాక | రథ సము సను
యోధులను బ్రోవుచేసి యీ | యుద్ధమునకు
బలిగనర్పించి సోదర | వ్రాతమునకు
దూరమై చిట్టవరకు | తోడునీడ
లేక నందుకుఁ గానియో | కాకబ్రతుకు

గడుపుచున్నట్టి దుర్యోధ ॥ నుఁడు మహాభి
మాని, యొచ్చోటనుండెనొ ॥ మాకుఁ జూపుఁ
డయ్యవగచేత రాము న ॥ దయ్యవాని
వదనమును జూచి పోవంగ ॥ వచ్చినాము.

ధృత—అయ్యో ! ఈతని యెత్తిపొడుపు మాటలతిదారుణ ముగ నున్నయవే?

అర్జు—అన్నా ! చూచినంతమాత్రముననే హడలెత్తుచున్న వీరల నతేంత భయపెట్టెదవేల? గాన నామాట విని సదాచారమతిక్రమింపకుండ వారిని గలియుదము. రమ్ము.

భీము—(నవ్వుచు) తమ్ముఁడా ! అట్లనే కానిమ్ము (ముందునకు నడతురు) అర్జునా ! కురునాథుఁడదుగో; ఇదుగో మాతాపితలు; వీరికి నమస్కరింతము.

అర్జు—అన్నా ! ఏమని నమస్కరింతము ?

భీము—నామకర్మములఁ దెలుపుకొనుచునే సుమా ?

అర్జు—ఓ మాతాపితృలారా !

గీ. ఎరిని నమ్మి నీసుతుఁ ॥ డింతవఱకు
వచ్చెనో? యెవ్వఁడెపుడు గ ॥ ర్వంబుతోడఁ
బెద్దలఁ దృణీకరించి శి ॥ క్షింపఁబడెను
అట్టి కర్ణునిఁ గూల్చిన ॥ యర్జునుండ
మీకు వినయముగాఁ బ్రణ ॥ మిల్లుచుంటి.

భీము—తండ్రీ ! ఓతల్లీ ! వందనములు. ఓహో! మఱచితిని. మీరంధులుగాన నేనెవరనో తెలుపవలసి యున్నది గాఁబోలు? నేను భీముఁడను. ధర్మనందనుని సోదరుఁడను. పార్థుని కన్నగారినగుదును. కురుకుమారుల నందఱసంహరించి దుశ్శాసనుని రుధిరమ్మును గడుపు

నిండఁ ద్రౌపది వానిప్రేగులు మెడలో ధరించి దుర్యోధనుని తొడలు ఛేదించి నాయొనర్చిన ప్రతిజ్ఞఁ దీర్చుకొనుటకై వచ్చిన వాఁడను.

ధృత—ఓరీ ! దుర్మార్గ ! పృథాపుత్రాపంబులతో నేమిప్రయోజనము. నాసుతులనింత జేసితివని యదరిపడకుము. తేపునీకాలము సమీపించుచున్నయది. ఎవ్వరును యీధరామండలంబును శాశ్వతముగా నిలుచునది లేదు. ఏనాఁడు క్షత్రియకులమున నుద్భవించితిమో ఆనాఁడే యొకప్పుడు జయమును మఱొకప్పుడు పరాజయమును బొందుచుందుమని ప్రతివాని నొసట వ్రాయఁబడి యున్నది. ఇది నీప్రయోజకత్వమని గర్వపడకుము. ఇదియంతయు దైవఘటనమని గుర్తెఱుంగుము.

భీము—తండ్రీ ! జ్ఞానివినీవు. అజ్ఞానులము మేము. వయస్సునఁ జాతమా పెద్దవునీవు చిన్నవారము మేము. మాపల్కులయందు దోసములుండవచ్చును. కోపపడియెద వేమి? భీష్మద్రోణకృపాశ్వత్థామాది ప్రభృతులతోనిండియున్న సభలో నింతినిగొప్పఁబట్టుకొని యీడ్చుచు నీసుతుండగు దుశ్శాసనుండు కట్టుపుట్టములొల్చుచుండ వార్తయైవిలపించిన ద్రౌపదీదేవిగోల నీకు వినరాలేదా ? నీవు అంధుఁడవుగాని బధిరుఁడవుకావుగదా ? వయసుదీఱిన ముదుసలివి. మాకుఁ బెత్తండ్రివి. నీ హృదయంబుక్కుముక్కతోఁ జేయఁబడకున్నచో నంతటి యకార్యమును వారింపలేకుందువా ? ఆమహాపతివ్రతాతిలకముయొక్కయును యూరక బోవలసినదేనా? ఈమూర్ఖుఁడు, యీదుర్యోధనుఁడు. ఆయింతినే తనతొడపైనిఁ గూరుచుండమని కనుసన్నఁ జేయుట దోసము కాదనుకొంటివా ? మాయజూదమును గల్పించి రాజ్యము హరించుట గొప్పతనమని హర్షింతువా ? అర్ధరాత్రంబున గాఢనిద్రాసక్తులమైయుండ యిల్లు గాల్పించుటదోషము కాదా ? పెనుబాములచే గఱపించుటదోషము కాదా? వారణాసికిఁబ్రవాసమంపుట దోసము కాదా? అన్నంబు

నందు విషంబు గలిపించి పెట్టించుట దోషము కాదా ? కర్ణుఁడు ద్రౌపదీకాంతను తన్నారవభర్తగాఁ గైకొనుమని యనుటయు, నోసీ ! యనియు, అంకులాడీ! యనుటయు హీనముగా నీవీనులకు వినఁబడలేదా ? ఇట్టి దుర్ణయంబులకు నీకుమారులు పాల్పడినను మిక్కిలి యోర్పుతో వాటినెల్ల సహించి వరుసగాఁ బదమూఁడువత్సరంబులు అగణ్యాజ్ఞాతదీక్షలు బూర్తిఁగావించుకొని యిప్పటికేని బుద్ధులు మాఱినవేమో, రణముతో నిమిత్తము లేకుండ సుఖపడఁదలంచిరేమో, చిట్టచివఱకైదూళ్లైన జాలునిమ్మని యడిగి వారితలంపును విచారించిరమ్మని వాసుదేవుని రాయబారిగా నంప మా రాయబారమును త్రోసిరాజనుట లటుండనిమ్ము? మీఁదుమిక్కిలి భగవంతుఁడగు శ్రీకృష్ణుని బంధింపఁదలఁచుట నీకుఁ దెలియదా ? నీకది సమ్మతంబైనదేమి ? తాఁబట్టినకుందేటికి మూఁడేకాళ్లను మూర్ఖవాదముతో గణమే నిశ్చయపఱచి రారమ్మని మా సంధి రాయబారమునకుఁ బ్రత్యుత్తరముగా వార్తనంప మాశక్తిసామర్థ్యములఁ జూపుట నీకు దుర్మార్గముగాఁ దోఁచినదా? ఆహా ! ఏమినీజ్ఞానము? ఏమినీపెద్దఱికము ? ఏమినీధర్మపరాయణత్వము ? అయ్యో ! నూరు గురుకొడుకులు పోయిరని విచారపడుచుంటివా ? ఏదియో యొకరీతిని జీవరాసులన్నియు జీవితమును గడుపుకొనుచునేయున్నవి. అదియాటెక్క? మానాభిమానములవర్జించి లోకులేవిధముగా దూషింతురోయన్న నదురు బెదురు లేకుండ నమానుషకృత్యంబులకుఁ దలలొగ్గిన కుమారుల కొఱకా యేడ్చుచున్నాఁడవు? నీకుమారుల చావునకు మేముగాదు నీవలన నిరసింపఁబడవలసినది?

గీ. కురుకులము రూపుమాప నీ కొడుకులందు
నగ్రజన్ముఁడుగా నల రారుపట్టి
యీదురాత్ముని పైఁబడి యేడ్చెనీదు
శోకవహ్నిఁ జల్లార్చుకో జూడుమయ్య!

దుర్యో—ఓరోరీ! దురాత్మా వృకోదరా! వృద్ధరాజునొద్ద పరిగల్భములఁ గొట్టుచున్నాఁడవేమిరా ? నన్నుఁగదా చూడవచ్చితినని యంటివి? నేనిటనుంటిని. ఈదెసకురమ్ము?

భీము—ఎవరువారు? (దుర్యోధనునివైపుఁదిరిగి) ఓరోరీ! గుర్తించనైతిని.

గీ. అంతటి మహాభిమానివి యెంతలెంతొ
ఘనమైన కార్యములొనర్చి ఖ్యాతిఁగాంచి
నేనెగాఘనుఁడంచు గర్వాననుండు,
వాఁడవిదియేమి యిట్టులున్నాఁడవీవు.

నీరూపురేఖావిలాసంబులు మఱొకవిధముగా నుంచుటచేఁ దెలిసికొనుటకు మాకుఁ గష్టమైనది.

దుర్యో—ఆఁ. దురాత్మా! ఇదిగో మదీయగదాదండంబున నీశిరంబును శతభిన్నంబులుగావించెద? (అని లేచుచుండ ధృతరాష్ట్రుఁడు వారించుచున్నాఁడు.)

భీము—ఓరీ! భరతకులకలంకా! నీపౌరుషము, నీగదాప్రభావము మాకునూతనమైనదిగాదు. కూర్చుండుము. క్రూరా! పాషాణహృదయా! అట్టెపదరెదవేని నీతమ్ములగతియే నీకునుపట్టగలదు, (కోపము నభినయించుచు గదనుత్రిప్పుచున్నాఁడు)

అర్జు—అన్నా! వృకోదరా ?

గీ. కడుపుమంటచేతఁ గారులుపేలెడి
వానిపైనఁ గ్రోధ మూననేల ?
సమయమున్నదివాని సమయింపగాఁ వేత
పోదమింకరమ్ము వాదమేల ?

భీము—(వినుపించుకొనకనే) ఓరీ! మూఢదుర్యోధనా!

గీ. నేను దాన్నసేను పైన గూరుచునుండి
నెత్తు రార్చుచుండ నీవు కనుల
నీరుగార్చుచుండి దూరంబుగా నున్న
యావిదగా వెరూ సు యోధనుండ!

దుర్యో—ద్యూతదాసుఁడవగు నీతో నాకు వృథావాగ్వాదమేటికి? నావలెనే నీసహోదరులుగూడ సోదరదుఃఖప్రవాహమున మునిఁగియున్నప్పుడే నాప్రతాపము తెలియును లెమ్ము?

భీము—(నవ్వి) మాసోదరులలో నెవ్వరైనఁ గూలినను నీవలె నేడ్వరు వారికింక నీప్రపంచములోఁ బనియేయుండదు. ఏదియెట్లయినఁగా నిమ్ము: మేమింక నీయెడల నుపేక్షఁజేయరాదు.

(తెరలో)

ప్రొద్దుక్రుంకుటచే నింక సమరంబును జాలించి శిబిరంబులకు విచ్చేయుఁడని ధర్మనందనుని యాజ్ఞయైనది, ఓహో! భీమార్జునులారా! ఇఁక దయసేయుఁడు?

అర్జు—అన్నా! పెద్దన్నగారి యాజ్ఞయైనది. రమ్ము పోదము.
(ఇరువురును నిష్క్రమింతురు.)

(తెఱలో)

ఓరోరి! పాండవమధ్యమా! అర్జునా! వెనుకకు మఱలుము. వెనుకకు మఱలుము?

ధృత—నాయనా! ఆచార్యపుత్రుఁడగు నశ్వత్థామయిటు వచ్చుచున్నాడు. ఎదురుఁబోయి సగౌరవముగాఁ దోడ్కొనిరమ్ము?

దుర్యో—తండ్రి! నేనుబోనేల? వానితోఁ బ్రయోజనమేమియునుండదు.

అశ్వ—(ప్రవేశించి) కౌరవేశ్వరా! జయమగుఁగాక? జయమగుఁగాక?

దుర్యో... (వికటముగు చూపుతో) ఆచార్యపుత్రా! కూరుచుండుము. కర్ణునివధానంతరముగదా మమ్ములను జూడవచ్చితివి. అప్పుడే యేమంతతొందరగలిగినది? నాచావునుగూడ నీవు నిరీక్షించినఁ జాల బాగుండెడిదినుమా?

అశ్వ—రాజా! ఇంతటియవస్థఁ జెందినను నీకింక నాయభిమానముపోలేదు. పెద్దలయెడ వినయభావమును గుదుర లేదుగా? నీమాట నేనేలఁ గాదనవలయు. తథాస్తు.

(అని నిష్క్రమించును.)

ధృ—నాయనా! నిన్ననవలసినదని యేమియును లేదు. భరత కులవినాశమునకుఁ గాలమా సన్నమైనప్పుడు నీవేమి చేయుదువు లెమ్ము? కాని (చెవిలో నేదియో చెప్పి) నాయనా! యిట్లు ప్రవర్తింపుము. మేము పోయెదము. గాంధారీ! మనమిపుడు శల్యునివిడిదికిఁ బోదము. (అని వెడలఁబోవుచు)

సంజయా! మెల్లఁగా మమ్ముల నింటికడదిగవిడచి నీవు స్వయముగాఁబోయి యాచార్యపుత్రుని దర్శించి నామాటలుగా; ఓగురుపుత్రా! ఏవిషయమెట్లుండినను నామొగముఁజూచి యా బాల్యమునుండియు మాయింటఁ బెట్టిగిన విశ్వాసమునుజూపుము. ఈయొక్కకుమారునివిషయ మైనఁదగు జాగ్రత్తఁగైకొనుమని వచింపుము.

సంజ—చిత్తము. మెల్లగా నడచిరండు. రథము సిద్ధముగానే యున్నది?

దుర్యో—సూతుఁడా! రథముకడకు నడుపుము?

(అందఱు నిష్క్రమింతురు.)





# వేణీసంహారము

## షష్ఠాంకము.

(ప్రవేశము:- ధర్మరాజు, ద్రౌపది, చెలికత్తెయు, కంచుకియు)

యుధి—(దీనవదనుఁడై) దేవీ! యోధవరులగు భీష్మద్రోణ కర్ణశల్యులను జయింపఁగల్గితిమి. ఇంతవఱకును మనపక్షమునందే విజయముగాన్పించుచున్నది. కాని నేఁడేలకో మఱి భీమసేనుని జయమును గూర్చి నాకు సందేహము పొడముచున్నది. కారణము గ్రహింపఁజాలకుంటిని ?

ద్రౌప—నాథా! మీ కెందులకిట్టి భ్రమంబుఁ గలిగించుచున్నది నేనేగదా ? నీమూలమున ననువదంబునుగూడ చేర్చి యొంచులకరు ?

యుధి—ప్రేయసీ! నీవొక్కదానవే కారణభూతురాలవు కాదు. కాలమును గర్మమునుగూడ గలిసినప్పుడిట్టి భ్రమంబులు గల్గుచుండుట సహజమే, అంతియగాక ననుమానములుగూడ నుత్పత్తిల్లుచుండును. ఇంక నేమేమియో సంభవించుచుండును, ఓయీ! బుధకా!

కంచు—ఆజ్ఞ.

యుధి—భీముఁడు తనప్రతిజ్ఞానిర్వాహణంబునకై నేఁడు దీక్ష వహించి.

గీ. శత్రునిన్ బట్టి రణమునఁ జంపుటొండె
చచ్చుటొండె నొండేనిఁ జేకొల్పంగవలయుఁ

కాని యితరంబుగా రాను కే రాను గృహముఁ

జేరనని తీవ్రకోపిమై కే చెప్పిపోయె.

ఈసంగతిఁదెలిసికొని సుయోధనుండు నేఁడుదయమునుండియు మాయ మయ్యెనఁట. కాన నేగుహాలలోడాగెనో, యేయరణ్యములకుఁ బలాయనమయ్యెనో, యేమడుగులలో మునిఁగెనో, యేరియాశ్రయమునఁ జేరెనో, యెఱింగివచ్చుటకై నిపుణులైనవారిని నియోగించు టత్యవసరమనియు, ముందీకార్యమొనర్చి యనంతరంబుననే యితర కార్యములకు దొరకొనునది యనియు నాయాజ్ఞగాపోయి సహదేవునితో చెప్పుము?

కంచు—చిత్తము (అని నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) మహారాజా! కృష్ణునిచేఁ బంపఁబడిన పాంచాలకుఁడువచ్చి ద్వారముకడనిలచియున్నాఁడు. సెలవైనచోఁ బ్రవేశపెట్టెదను.

యుధి—తత్క్షణంబదోడ్కొనిరమ్ము?

కంచు—(వెడలి పాంచాలకునితోఁ బ్రవేశించి) అదుగో మహారాజుగారు (అని వెడలిపోవును.)

పాంచా—జయము. జయము, మహారాజా! దేవరకుఁ బ్రియవార్త లెఱిఁగింప శ్రీకృష్ణునిచేఁ బంపఁబడితిని.

యుధి—మేలుమేలు! పాంచాలకా! దుర్మార్గుఁడగు దుర్యోధనుని జాడ తెలిసినదని చెప్పెదవా?

పాంచా—దేవా! అంతియేకాను. పట్టుఁబడెననువార్తఁ దెలుపుదును.

యుధి—(పట్టరాని సంతోషమునఁ గౌఁగిలించుకొని) పాంచాలకా! శుభవార్త నెఱిఁగించితివి. తానేపట్టుఁబడియెనా? మనవారిపరిశ్రమముచేఁ బట్టుఁబడియెనా?

పాంచా—దేవా! స్వీయబలనాశనమునకై పరితపించుచు ముం

దుగతి యేమిరా భగవంతుఁడా యని దేవులాడువాఁడు తనంతటఁదాను గాన్పడునా? మనవారి పరిశ్రమముమీఁదనే పట్టుఁబడినాడు.

ద్రౌప—నాథా! ఇప్పుడద్దురాత్ముఁడెందుండెనో ప్రశ్నింప వేఁడెద.

పాంచా—అమ్మా! ఎందుండును? పట్టుఁబడినవాఁడు రణముఖంబున నుండును. శాత్రవుల నిర్బంధనమున నుండును. తగిన ప్రాయశ్చిత్తమును పొందుచుండును.

యుధి—దేవీ! క్షత్రియునకు రెండే మార్గములు. శత్రువుని సంహరించుటో, తాను శాత్రవుని హస్తంబునఁ గూలుటో, అందుచే నెందున్నవాఁడని మనము వేఱుగఁ బ్రశ్నింపఁబనిలేదు. ప్రియసీ! ఇఁక నీవు వానిమూలమున భయపడనక్కఱలేదు. చూఁడు.

గీ. ధర్మపద్ధతిఁ ద్యజియించి దారుణమగు
పనికినక్కాఁడు దొడఁగెనా పాపపశువు
అపుడె చచ్చెనటంచు హృ దంతరమున
సంతసింపంగవచ్చు ని స్సంశయముగ.

పాంచాలకా! శ్రీకృష్ణుఁడంపిన సందేశమును సవిస్తరముగాఁ దెలియఁ బల్కుము?

పాంచా—చిత్తమవధరింపుఁడు. శల్యుం డేలికచేఁ దెగుటయు, శకునిసహదేవునిచే నీల్గుటయు, లెక్కలేని యోధవరులు రణాగ్నికింధనంబులగుటయుఁ, దన్మూలంబున స్వబలంబుపూర్తిగా నాశమందుటయు నెఱింగి భీమసేనుని దారుణప్రతిజ్ఞను స్ఫురణకుఁ దెచ్చుకొని తనకిఁక మరణంబు తప్పదనినిశ్చయించుకొని దుర్యోధనుఁడు మాయమయ్యెను.

యుధి—ఛీ! దుర్యోధనా! ఏమిపని చేసితివి?

గీ. మానధనులైనవారికి మంచిమార్గ
మగునె? క్షత్రియకులమున నవతరింప

లేదె? యిటుసేయఁగా సిగ్గు లేదె గొప్ప
వంశమున మచ్చఁ బెట్టుట పాడియగునె.

పాంచాలకా! పిమ్మట?

పాంచా — దుర్యోధనుఁడు మాయమయ్యెనని మనవారనుట నెఱింగి భీమార్జును లిరువురును శ్రీకృష్ణసహాయులై శమంతపంచకం బంతయుఁ గాలించి గాలించి యెందును గానరామి, నిరాశఁ జేసికొని నిట్టూర్పులు విడచిరి.

యుధి — శ్రీకృష్ణా! వాసుదేవా! మామూలమున నీకుఁగూడ నట్టికష్టములు కలుగుచున్నవయ్యా? మావంటి భక్తులునీ కెందఱుగలరో? వారందఱును నీనియోగమునకై యెట్లుపరితాపపడుచుండిరో? ఎందఱు నీరక్షణకు నిరీక్షించుచుండిరో? ఎందఱు దుర్మార్గులకఠినబాధలకు తాళ లేక నీనివాసస్థలంబునకువచ్చి చేరిరో? కనుంగొన దుర్భరముగదా? మామూలమున నీలోకపరిపాలనమే మాని కాలమంతయు మాకొ ఱకే వినియోగపఱచు నీసహాయమును మేమెన్నఁటికిని మఱువఁజా లము. మఱువఁజాలము? పాంచాలకా! పిమ్మట?

పాంచా — దేవా! ఇట్టిసమయములోనే బరుగుపరుగునఁ జను దెంచిన యొకానొకభటునిమూలమున సుయోధనుండొక హ్రదతీరం బున మడుంగులో నిరువురు మానవులు దిగినటుల యడుగులు జాడలు గన్పడెనని యెఱింగి మనమ్ములనందఱనత్త్యావునకు శ్రీకృష్ణభగవానులంత మేమా భటునివెంటఁ దోడ్కొనిపోయి నిజవృత్తాంతమరసివచ్చి మన వారికెఱింగించితిమి. అంతట శ్రీకృష్ణునితో గలిసి భీమసేనుండు మడు గుకడకుంజని యిట్టులని కేకఁబెట్టె. ఓరోరి ద్రౌపదీకేశాంబరాకర్షణ మహాపాతకీ!

గీ. సమరభూమి వెలఁగి యీ చందమున హ్రదంబునన్ దాగినంతనే దర్పహీన!

జాలిఁగొని భీమసేనుండు । సలిపినట్టి
ప్రతినవిడనాడుకొనుటన । వట్టిమాట.

నీతమ్ముని దుస్ససేనుని రుధిరంబును గడుపాఱఁగ్రోలిన యీభీమసేనుని క్రోధానలము సగముమాత్రమే తీఱె. నీతొడలు ఛేదించి నీప్రాణముల నీగదాదండమునకు బలిగ నర్పించునప్పుడుగాని మిగతసగము తీఱదు. అప్పుడుగాని మదీయగదాదండము నిదురఁబోదు. మఱియు.

గీ. అప్పుడేగద ద్రౌపది । యంతరాత్మ
సంతసంబందుటలు; సతి । సౌఖ్యముగను
హాయిగా నిద్రఁబోవు మా । యన్నగారు
సకలజనులును పూర్తిగా । శాంతిఁగనుట.

కాన నన్నువ్యధాయాసపెట్టక మడుఁగునుండివిచ్చేయుము. వీరపురుషోచితమార్గంబును విడనాడకుము. ఎవరెవరిపై నెట్టియాసలఁ బెట్టుకొని యీదారుణకర్మంబున కొడిఁగట్టితివో ఆయోధవరుల సంహరించితిమి. మిగిలినది నీవొక్కఁడవే. మడుఁగులో దాగికొని నీకర్మంబును గూర్చి తలపోసినంతమాత్రమునఁ బోయినవీరులువచ్చి సహాయముఁ జేయరు. నీకు నేనిప్పుడొనర్పనున్నది యుపకారమేగాని యపకారమొంతమాత్రమును లేదు. ఏమందువా?

గీ. భ్రాతృశతవియోగముచేత । పరితపింప
నవసరంబుండదిఁకమీఁద । నందఱికిఁక
శాశ్వతంబుగఁ జూచుచు । సంతసింపఁ
దగును వేలేచి రార హ్ర । దంబునుండి.

యుధి—భద్రా! ఆపలుకుల కాతఁడాగ్రహావేశుఁడై తప్పక మడుఁగునుండి వెలువడియుండఁగలఁడు. అట్టులే జరిగినదా?

పాంచా—దేవా! అంతమాత్రముచేతనే వెలువడునా?

యుధి—పిమ్మట?

పాంచా—రోషంబును బుట్టించుమాటలెన్నియున్నను నాతఁ డెంతవలికినను బయటకురాకుండుటఁజూచి భీమనందనుఁ డామడుఁగునఁ బ్రవేశించి యతిభీకరముగా నీరంతయుఁ గలిపివేసెను. అప్పుడుగాని సుయోధనుఁ డామడువునుండి వెడలలేదు.

యుధి—వెడలియుద్ధంబునకేవచ్చెనా ?

పాంచా—భీమసుయోధనులు నీటిలోనే గదాయుద్ధంబునకుఁ దలపడిరి గాని కృష్ణార్జునులిద్దఱు నాపద్ధతియుత్తమమైనది కాదని యెఱిఁగింప నొడ్డుననే పోరాడుట కిరువురంగీకరించి యట్టులనే యొడ్డునకు వచ్చేసిరి.

యుధి—సుయోధనుఁడింకఁ బ్రయోజనములేదని తెగించియుండ వచ్చును.

పాంచా—వెంటనే తెగించలేదు. రణభూమిఁగూలియున్న వీరులశవములఁగాంచి గదనునేలపైఁబెట్టి దైవప్రాతికూల్యమునకెంత యు దైన్యపడసాగె. అంతవృకోదరుఁడు సుయోధనుఁడా!

గీ. తగినసాయంబులేదు, శా । త్రవులబాంధు
పుత్త్రులను నెట్టులీరణ । భూమియందుఁ
గూల్చువాఁడనటంచు నం । తోషపడఁగ
నేల? నీలీలఁజింత వ । హింప నేల?

గీ. యుద్ధమొనరించు బుద్ధియే । యున్న వేగ
మేవురందున నొకరిని । నేరికొనుచు
నిచ్చవచ్చిన యాయుధ । మీవుదాల్చి
సలుపరావయ్య ఆహవో । త్సవము నేఁడు.

అనిచెప్పెను.

యుధి—అందులకాతఁడేమని ప్రత్యుత్తరంబిచ్చెను ?

పాంచా—దేవా.

గీ. ఇంతమందిని రణభూమి కిచ్చి నేను
బవరమును మానుకొనుటలు వట్టిమాట
ఇంచుక శ్రమంబుఁ బాపుకో నెంచియుందుఁ
గాలిడితిఁగాని భయపడి గాదునీకు.

అని ప్రత్యుత్తరించిచ్చుటయేగాక! ఓయీ! భీమసేనా! ఇతరులను నేరుకొననేల? ఆదినుండియు నేరిపైఁ బగఁదీర్చుకొనఁ గంకణముధరించితినో, యేయాయుధమును నమ్ముకొని యింతఁదనుక వైరిమండలికిఁ జిక్కక మేటిపరాక్రమవంతుఁడనని బిరుదంబుగంటినో, ఆశాత్రవునే, ఆయాయుధముతోడనే గెలువనిశ్చయించుకొంటిననుచు నతిభీకరముగఁ బలుకుచుఁ దనగదాదండమును చేతధరించి రణంబునకుఁ దలపడెను.

యుధి—భీమసేనుఁడీ ప్రత్యుత్తరమున కానందపడియుండును?

పాంచా—ఆనందపడుటయేగాదు "కౌరవేశ్వరా! నీపౌరుషమున కివ్వాడు మెచ్చుకొంటిని. నీకోరిక నాకోరిక ననుసరించియేయుండుటచే నెంతయో యానందపడితిని. నీపట్టుదలకుఁ గృతజ్ఞుఁడ"నని బలుకుచుఁ దానుగూడ రణంబునకుఁ దలపడియెను. రణ మతితీవ్రరూపము దాల్చుటచే నీసంతోషవార్త దేవర కెఱిఁగింప శ్రీకష్ణునిచేఁ బంపఁ బడితిని.

యుధ—పాంచాలకా! ప్రియవార్త నెఱిఁగించి మమ్ము సంతోషపఱచితివి. ఓరీ! భద్రా! నీవీపాంచాలకునిఁ దోడ్కొని పోయి సచివుల కెఱిఁగించి పారితోషికముల నొసంగుమని నాయాజ్ఞగాఁ దెలుపుము ?

కంచు—చిత్తము దేవా! పాంచాలకా! రమ్ము. పోదము.

పాంచా—మహారాజా ! సెలవుఁ గైకొనియెదను.

యుధి—మంచిది.

(పాంచాలక సహితుఁడై కంచుకి నిష్క్రమించుచున్నాఁడు.)

యుధి—దేవీ!

గీ. ప్రతిన నెఱవేర్చుకొనక బో ౯ వదువృకోద
రుండు, నీవిఁక సుఖముగా ౯ నుండఁగలవు
విందుగాను సుయోధను చావు ౯ వినఁగఁగలవు
కౌరవాన్వయఋణములఁ ౯ దీఱిపోవు.

ఓరీ! ఎవఁడురా అక్కడ!

కంచు—(ప్రవేశించి) ఆజ్ఞ.

యుధి—నేఁడు మన భీమసేనుఁడు సుయోధనుని వధించిరాఁగలఁడు. వాని విజయంబునకు సూచనగానుచిత సమారంభముల సమకట్టవలయునని మన పరిజనంబున కెఱిఁగించిరమ్ము?

కంచు—చిత్తము (నిష్క్రమించును)

ద్రౌప—నాథా! మనభీమసేనుండు "మాసోదరులందెవ్వరైన నొకరి నేరికొని వానితో యుద్ధంబొనర్పు" మనిగదా బలికెను. తనను గాక నితరుల నేరుకొనినఁ బ్రమాదము కాదా?

యుధి—ప్రియసీ! వానియభిప్రాయ మదిగాదు.

గీ. బందుగులు మిత్రులును వీర ౯ భటులు సమర
భూమిఁగూలిరి యందు చే ౯ బోటుదక్క
యత్రసన్యాసి నైపోవు ౯ ననిదలంచి
రణముపై నాశఁబుట్టింప ౯ ననియెనటుల.

దుర్యోధనుఁడు మూర్ఖుఁడుగాఁడు. అన్యులను గోరువాఁడునుఁగాఁడు. ఒక వేళఁ గోరుకొనుననియే తలంపుము. చూఁడు?

గీ. శాత్రవుల దున్మనట్టి యా ౯ త్సాహమందు
నెవ్వరును దీసిపోరు మా ౯ యేవురందు
నేరిఁగోరినఁగాని నా ౯ హీనమతికిఁ
జావునిక్కము నిక్కమా ౯ చాన! వినుము.

(తెరలో)

ఓరీ! దేశమంతయు గొడ్డుపోయినదా? ఒక్క తాపసిదాహమును దీర్పఁగలుగు పుణ్యాత్ములెందును లేరా?

యుధి—(వినుటనభినయించి) ఓరీ! ఎవఁడురా అక్కడ?

కంచు—చిత్తము ఆజ్ఞ.

యుధి—వేగముగాఁ బోయి దప్పిఁగొనిన యాతపసి నిటకుఁదోడ్కొనిరమ్ము?

కంచు—చిత్తము (నిష్క్రమించి తాపసితోఁ బ్రవేశించును)

రాక్ష—(తనలో) నేను చార్వాకుఁడననియు, దుర్యోధనుని పంపున మాయవేషధారినై వచ్చితిననియు వీరు గుర్తించియుండరు. వీరిని వంచింపవలయుననిగదా సుయోధన చక్రవర్తియాజ్ఞ. ఇంక నాకర్తవ్యమునకై గడంగెదఁగాక.

యుధి—మునీంద్రా! వందనములు. ఈయాసనముపై దయసేయుఁడు.

రాక్ష—ఓపుణ్యదంపతులారా! ఇప్పుడీ గౌరవములతో నేమియుఁబనిలేదు. దాహబాధచేఁ గడు కృశించుచుంటిని. ముందు నాకీబాధనపనయింపుఁడు.

యుధి—తమవంటి మహాతపస్సంపన్నులు విచ్చేసినపుడు దాహశాంతిఁ గలుగఁజేయుటయే మాకుభరమగునా? మహానుభావా?

గీ. పిలిచినను వత్తురే? మహాత్ములిట్టిదియు
రాకరాకను బోలెడి మాకలుషము
లడఁగెజన్మలు ధన్యములాయె దేవ!
వేయు నేటికి గృహము పవిత్రమయ్యె.

ఓరీ! భద్రా!

కంచు—(ప్రవేశించి) దేవా! ఆజ్ఞ.

యుధి—వేగముగాఁబోయి బంగరుగిండియతో జలంబుఁగొని రమ్ము?

కంచు—చిత్తము (వెడలి జలముఁగైకొనిప్రవేశించుచున్నాఁడు)

యుధి—(అందుకొని) మహాత్మా! ఇదిగో నీరముఁగైకొనివిశ్రాంతిఁ జెందుఁడు. నేనిదే ప్రవనముతో విసరెదను. (అని అట్లుచేయుచున్నాడు.)

రాక్ష—(గిండియఁగైకొని, అనుపానించి మఱలఁగిందనుంచి( ఓహో! నీవు క్షత్రియుఁడవు కాఁబోలు చూఁడు?

గీ. కయ్యముల కయివిరతంబుఁ గాలుదువ్వ
కొనుచు జననాశనముఁ జేసి కొనెడిక్షత్రి
యుల జలంబును నెప్పు డొల్లమయ్య
తగను లట్టులఁగొనుటలు తప్పుసూవె,

కావున

గీ. చల్లఁగావీచుగాలిచే నల్లిబిల్లి
గానలముకొన్న వృక్షశాఖలుంబొసంగు
నీడచేఁ బాపుకొనియొడి వాఁడశ్రమము
వలదుకలదయ్య యిప్పుడీ జలమునాకు.

యుధి—మహాత్మా! మీబడలిక తీఱినచో నింతగాఁ దాహాయాసపడుట కేమి హేతువో సెలవీయఁగోరెద?

రాక్ష—క్షత్రియోత్తములగు నర్జుననుయోధనుల గదాయుద్ధమవలోకించుచు నతిదాహముఁ బుట్టనందెందును నీరంబునుగానక యుద్ధమింక ముగియకమునుపే రావలసివచ్చినది.

యుధి—(విచారముతో) అర్జుననుయోధనులకుఁ గాదను కొందును. భీమసుయోధనులకై యుందును.

రాక్ష—యుద్ధారంభమునుండి స్వయముగాఁజూచి వచ్చినవాఁడను నాకుఁదెలియదా యేమి? భీమసుయోధనుల యుద్ధానంతరమే యర్జునసుయోధనులయుద్ధము జరుగుచున్నది.

యుధి—హా! భీమసేనా! (అని మూర్ఛిల్లుచున్నాఁడు)

ద్రౌప—హా! వాయునందనా. (మూర్ఛిల్లును)

రాక్ష—(కపటముగా భటునివైపుఁదిరిగి) భీమునివార్త వినఁగనే వీరిటుల మూర్ఛిల్లుచున్నారు. కారణం బేమైయుండును?

కంచు—అయ్యో! ఈమహారాజు భీమసేనాగ్రజుండగు ధర్మనందనుఁడు. ఈయమ ద్రౌపదీదేవి. అందుచే మూర్ఛిల్లిరి.

రాక్ష—అయ్యో! అటులనా! ఎంతప్రమాదము సంభవించినది?

యుధి—(నెమ్మదిగాలేచి) మునీంద్రా! ఏమన్నారు. భీమసుయోధనుల యుద్ధానంతరమనియా?

రాక్ష—రాజా! మీరలెవ్వరోయనుకొని యీఘోరవార్త నెఱిఁగించితిని. పాపమెుడిఁగట్టుకొంటిని.

యుధి—దేవా! మాకర్మమిటులుండ మీరేమిచేయుదురు చూచినవార్త నెఱింగించితిరి.

రాక్ష—రాజా! ధర్మనందనా! చూచినను నానోటివెంట వచింపవలసివచ్చెనే యని విచారపడుచున్నాఁడను. దైవప్రాతికూల్యమున కెవ్వరమును యేమియుఁ జేయఁజాలముగదా?

యుధి—మహానుభావా! నిజమేవచించితిరి. హా! తమ్ముఁడా! భీమసేనా!

గీ. లేనిపోనిరణంబుఁ గల్పించి యెన్నొ
బన్నములయందు మమ్ముఁ గాపాడినట్టి

నీవరాజయమును విని । నేనుమనుట
గలుగు నేయింక జీవముల్ । నిలువఁగలవె?

హా! సోదరా! మదీయాజ్ఞానువర్తీ!

గీ. దుస్ససేనునిఁజీల్చి న । త్తురును ద్రావి
నగముదుఃఖమె బాపఁగాఁ । జాలినావు
కడమసగమెట్టు తీరు రా । గాలికొడుక!
ద్రౌపదీదేవికీ విష । తరుణమందు.

రాక్ష—రాజా! అచటజరిగిన విషయములనెల్ల సవిస్తరముగాఁ దెలుపకపూర్వమే నీవిటుల విచారపడియెద వేల? ఇఁక వినవలసినవి లేవనుకొంటివా?

యుధి—పర్యవసానము తెలిపోయినపిదప నింక వినుట కేమున్నది?

గీ. రణమునఁ భీమసేనుని । ప్రాణములను
గొనియె దుర్యోధనుండందు । కొఱకు నర్జు
నుండు గాండీవమున్ వీడి । యుండఁగా గ
దను ధరించి రణంబునఁ । దలపడియెను.

ద్రౌప—(మూర్ఛఁదేఱి విచారముతో) నాథా! స్వయముగా ముడివైతునని వాగ్దత్త మొనర్చిన నాహృదయేశ్వరుండగు భీమసేనుఁ డస్తమించిన వెనుక నీపాపపుతనువునుండి యేమిప్రయోజనము?

గీ. పరిభవపదవాగ్నిలోఁబడి । ప్రాణములను
బాయుమని స్పష్టముగ వ్రాసె । వనజభవుఁడు
వాని వ్రాతకు మేలు వి । ధానమున్నె?
కానజితిఁజొచ్చి నాథుని । గలియఁబోదు.

హా! జీవితేశ్వరా! వృకోదరా!

గీ. గదను జేఁబట్టియున్నయుం ♦ గని త్వదీయ
సోదరుఁడు నేఁడు శత్రువు ♦ వీఁడితఁడుక
గదను బలవంతముగలాగి ♦ కదనసీమఁ
జేగనీవిట్లు మానంబుఁ ♦ జెందఁదగునె?

గీ. క్షత్రియకులానఁ బుట్టవె? ♦ క్షాత్రధర్మ
మనుసరింపవె? నీవు చే ♦ సిన ప్రతిజ్ఞ
దాటుదువె? యిద్దివిరుల ♦ ధర్మమగునె?
యెవరుగతియంచు మొఱ్ఱవెడద ♦ నింక నేను.

(మూర్ఛిల్లుచున్నది.)

యుధి—(ఆకసమువంకఁజూచి) అమ్మా కుంతీ! విధివిధానమే తీరుగానున్నదో చూచుచున్నావుగదా?

గీ. పాండుపుత్రులు యేవురు ♦ పరమయోగ్యు
లతిబలాఢ్యులు ధర్మప ♦ ద్ధతులమీర
నట్టివారని జనులాడు ♦ నట్టిమాటఁ
గొట్టివైచెను నెత్తిపైఁ ♦ గొట్టిబ్రహ్మ.

గీ. శాత్రవుల సంహరించి శా ♦ శ్వతముగాఁగ
ధర్మసంస్థాపన మొనర్పఁ ♦ దలఁచియున్న
నామకోరికవ్యర్థమయ్యె ♦ నాదుసోద
రుండు యీగతి నన్బాసి ♦ యుండఁబట్టె.

రాక్ష—ఓరాజదంపతులారా! విచారించి చేయఁదగినదేమియును లేదు. ఊరడిల్లుఁడు. నా చెప్పఁబోవు వాక్యములఁ బూర్తిగా వినుఁడు. భీమసేనుని మృతికిఁగారణము బలరాముఁడేసుడీ? ఆతని సంజ్ఞయే యింత చేసినది. కురుపతి మానభీముని తొడలు ఛేదించుట కదియే యాధారమైనది. ఇఁక నేను చెప్పఁదగినదేమియును లేదు.

యుధి—అయ్యా! మునీంద్రా! తాము చెప్పఁదగిన దంతయుఁ జెప్పనే చెప్పితిరి. కాని భీమునివధకుఁ గారణము బలరాముఁడనియూ వచించితిరి. ఓ బలదేవా! ఎంత ఘోరకార్యమునఁ గొడిగట్టుకొంటి వయ్యా?

గీ. మేము మేనత్తసుతులము ♦ గావునీవ
సోదరునకును నాడు న ♦ సోదరునకు
గలుగు చెలిమిఁ దలంపవే? ♦ కఠినమైన
హృదయమది యెట్లు నీకు ల ♦ భించెనయ్య.

గీ. పాండవులయందు నున్నలో ♦ పంబదేమిఁ
గంటివని నీవనూయతేఁ ♦ గంటివయ్య
యిరువురును నీకు శిష్యుల ♦ రేగదాయ
దేలఁజివఱకు నీబుద్ధి ♦ యిటులమారె.

గీ. న్యాయమును ధర్మమునువీడి ♦ నాయనుంగు
సోదరుని నిరపరాధినిఁ ♦ జూచియింత
ఘోరమొనరింపఁగా నీకు ♦ గోర్కెఁబుట్టు
టన్న మూడగు ప్రారబ్ధ ♦ మౌనుగాదె.

ద్రౌపది—హా! జీవితేశ్వరా! నన్నుఁ జివఱకు హీనఁపుబ్రదుకు బ్రదుకుమని చెప్పిపోయితిరా? మరుత్తనయా! నేనాజన్మాంత మీకురుల నిటుల విరియఁబోసికొని తిరుగవలసిన దేనా? పాండవులు వాకృారులేగాని క్రియాశూరులుగారని లోకులందఱుఁ బరిహాసింప వాటినన్నిఁటిని భరింపవలసిన దేనా? నేసింకనీవియోగ్నిచేఁ గృశించవలసినదేనా? నాకన్నులనుండి నీరమిట్టు ధారలుగాఁ బ్రవహింపఁవలసినదేనా? నీసహోదరులు నల్వురును నీకొఱకేడ్చి యేడ్చి యుసురులఁ బాయవలసినదేనా? నాధా! నీపై నెంతయో నాశఁబెట్టుకొని యింత

కాలము ఁదనుక వరాభవక్లేశమును భరించుచున్నందులకు నీవు చూడవలసిన ఫలితమిదియేనా? సభలో నాఁడొనర్చిన దారుణమగు నీప్రతిజ్ఞయు మొన్న మొన్నఁ జతుశ్శాలాభవమున నాతోడ ననిన మాటలను పాలించుట లేకపోఁగాఁ జివఱకు నన్నీవిధముగఁ గూడ నథోగతిపాలొనర్చిపోయితివా? హా! భీమసేనా!

(మూర్ఛిల్లును)

యుధి—దేవీ! లెమ్ము. తడవతడవకును నీవిటుల మూర్ఛిల్లుచుండఁగను నేనిట్టులనే చింతాసముద్రమున మునిఁగియున్నను మనల నోదార్చువారెవరు? కాన నీవు చెప్పినటుల:—

గీ. చితిని పేర్పించి దానిపైఁ జేరిమనము
భీముఁగలియంగఁబోదము వెలఁది లెమ్ము?
అన్యథా దారిలేదు దుఃఖాబ్ధినుండి
తేలి యీఁవలఁబడఁగనే లీలఁగనిన.

ద్రౌప—(లేచి) నాథా! మీరేల నావెంటవచ్చెదరు? భీమసేనుఁడొనర్చిన ప్రతిజ్ఞకొఱకుఁ గాకపోయినను భీమునిఁబరమార్చిన కోప్రధానమాలర్పుకొనుటకేనియు రణరంగమునకుఱికి శాత్రవవధావిధానమునుగనుఁడు?

యుధి—ప్రియసీ! బాగుగాఁ జెప్పితివి. ఓరీ! కంచుకీ! నీవుపోయి వేగంబుగా నావిల్లును తీసికొనిరమ్ము. (ఆలోచించి) కంచుకీ! ఉండుము. విల్లక్కఱయేలేదు. నేను రణంబునకరిగి శాత్రవునితోఁ బోరవలసిన యవసరమునంతను మనయర్జునుండే తీర్చుచున్నాఁడు. కానఁ గంచుకీ! ముందుఁ బాంచాలికోరికెనుదీర్పఁ జితిఁ బేర్చుటకు దగు నుపకరణముల నాయత్తపరుపుము?

కంచు—హా! హా! ఎంతటిఘోరకార్యము నానెత్తిపైఁ బడు

చున్నది? మహారాజా! ఈకార్యమును నాచేతులమీఁదుగ నొనర్పఁజాలనని విన్నవించుకొనినందులకు క్షమింపవేఁడెద.

యుధి—అహా! భీమసేనా!

సీ. నీవు లేకుంటచేఁగదా । నేను పరిజ
నంబుచేఁగూడను బరాభ । వంబుఁగనుచు
నుంటి! యెంతటిదుర్గతి । నొందుచుంటి
ధర్మజుని గౌరవంబు ద । గ్ధంబె? యింక.

అయ్యా! మునీంద్రా! తాము సర్వకార్యనిర్వాహణదక్షులరు. మే మొక్క క్షణములో నీలోకమును బాసి మాసోదరునిగలియులాగున నొక్క శాప వాక్కును మాపైవిడచి పుణ్యంబుఁగట్టుకొనుఁడు? మీపాదములకు మ్రొక్కెదను.

రాక్ష—రాజా! మాశాపవాక్కులు నిరపరాధులమీఁదను, శాంతహృదయులమీఁదను బ్రయోగించిన వానికిఫలితము లేకపోఁగా మానిశ్శబ్దంబునకుఁగూడఁ గళంకము రాఁగలదు. సమస్తము నెఱింగిన నీవుఁగూడ నజ్ఞానుఁడవై యిట్టిక్రూరపుపనులకు మమ్ము నియోగించుచుండ మేము యిటనిలచుటయే పొరబాటు. రాజా! నేనింకఁబోయెద.

(నిష్క్రమించుచున్నాఁడు)

యుధి—దేవీ! నేననీయభిమతమును నెఱవేర్చెదనుండుము. నీవీలోఁగా నెవరెవరికేమేమి చెప్పవలసియున్నదో చెప్పి యీపరివారమును బంపివేయుము? (మరలవిచారముతో) తమ్ముఁడా! భీమసేనా! మదాజ్ఞాపరిపాలనాధౌరేయా! నీసుగుణంబుల నెన్నఁదలంచుకొని విలపింపను? ఇప్పుడు నేనేమని ఘోషింపను?

గీ. నీతిజాతి విసర్జించి । ద్యూతమాడి
యోడితినినిన్ను నద్దాసుఁ । గూర్చియెంతొ
వినయమాను జాటినాఁడవో । యనుజయిపుడు
బాసిపోవంగఁ బెద్దలో । పంబదేమి?

దేవీ! ద్రుపదరాజనందినీ!

గీ. బకునిఁ గూల్చినవాఁడు; కీచకుని వ
ధించిన పరాక్రమాఢ్యుఁడు మించి మాగ
ధుని వధించిన యమ్మేటి దోర్బలంబు
మనకిఁకను గానరాఁడు సుమా! పడఁతి!

నాయనా! మరున్నందన!

సీ. నిదురించు సమయాన నీటఁ ద్రోయుచునుండఁ
బ్రాణంబు లెట్లో గాపాడినావు
బసను గాల్పింప నాపద లేమి లేకుండఁ
గడు జాగ్రతగఁ జూడఁ గలిగినావు
అడవులలో రాక్షసావళి యేహానిఁ
జేయకుండఁగ నాపు జేసినావు
సింహబలుని వల్ల చేడకుఁ గీడురా
వంచకు ద్రుంచి రక్షించినావు

గీ. ఇట్టులే యెన్నియాపద లేనిరాఁగ
నీకృపాదృష్టి సారించి నీయనుంగు
సోదరులఁ బ్రోచి నేటికి శోకవార్ధి
ముంచినావు మమ్ము వంచించినావు.

ద్రౌప — ప్రాణేశ్వరా! మనము కర్తవ్యమునే మఱచుచుంటిమి సుండీ: నేను మానవారికి దెలుపవలసినది. భీముని మృతి వార్తయే దక్క నన్యమేమియును లేదు.

యుధి — కళ్యాణీ! బుద్ధిమతికా! నీవు పోయి మాయమ్మతో నిట్లుగాఁ జెప్పుము?

గీ. ఇంటికిం జిచ్చు పెట్టఁగా నెవనిశక్తి
వలన నివును నీసుతుల్ బైటఁబడిరో!

అట్టిభీముని మృతివార్త ♦ నట్టువినుతు
నమ్మరో! వినరాదప్ప ♦ దారుణంబు.

కంచుకీ! పరలోకంబునకుఁ బోవుచుండి యీపెద్దన్నయగు ధర్మనంద నుఁడిట్లని వచించెనని చెప్పుము?

గీ. పెద్దనయ్యను వయసున ♦ బుద్ధియందు
గొప్పవాఁడవుగాన నా ♦ గురుఁడవైతి
వయ్య కావున వేఁడెద ♦ నయ్య నిన్నుఁ
దండ్రిగారికి నీళ్లు వ ♦ దలుమటంచు.

నకులునితో వత్సా!

గీ. మమ్ము నిఁకమీఁదఁ దలఁపక ♦ మఱచిపొమ్ము
ప్రాణముల నట్టులేనిఁగా ♦ పాడుకొమ్ము
వైరియింటను కృష్ణుని ♦ వంచనోపిపి
సంబులందునవో నివా ♦ సంబుఁగాంచి.

అని యంటినని చెప్పుము?

జయంధర! ఒకవేళ రణంబున విజయలక్ష్మి నార్జించి పార్థుఁడే వచ్చినయెడల నిట్లని చెప్పితిననుము?

గీ. అన్నమృతికిఁ గారణమైన ♦ యట్టియా హ
లాయుధుఁడు వాసుదేవున ♦ కన్నగారు
గానఁ దీవరపుశకయ్య ♦ వానిపైన
మఱల శాత్రింబుఁగై కోక ♦ మసలుమయ్య
విపినమందు వసింపుచు ♦ విజయ నీవు.

ద్రౌప.—బుద్ధిమతికా! నీవుపోయి మా చెల్లెలగు సుభద్రతో "అమ్మాయీ! సుభద్రా! కోడ లుత్తర గర్భమును ధరించియున్నది. ఆమెకుఁ బుట్టఁబోవు నిసువే మనకిన్ని నీళ్లువదలుట. కాధారభూతుఁడు

గాన నీవామెను జాగ్రత్తగఁ గనిపెట్టి యుండవలసినదని యంటివనుము?

యుధి—ప్రేయసీ! ఎంత వెఱ్ఱిదానవు!

గీ. వ్రేళ్ళతో సల్లిసలు నావ • రించియున్న
యమ్మహావ్రతమే మాయ • మగుచునుండ
దాని మొక్కటె నీడయౌఁ • గాఁగనంచు
నేమిరో యానతో వది • యింతు వేల?

(అటునిటుఁజూచి) దేవీ! నీయాలోచనము సార్థకమగుచున్న దరుగో! చూఁడుము?

గీ. అడుగో! కరములనెత్తి హు • తాశనుండు
పిలుచుచున్నాఁడు మనలను • భీముకడకు
వేగిరము పోవగమ్మని • వెలఁదిలెమ్ము
అతనిసాహసంబునకునమ • స్కృతులనిమ్ము.

ద్రౌప—దేవా! నేను ముందే పోయెద ఎందుచేతనందు రా? నాప్రాణేశ్వరునకు నామీఁదఁ బ్రేమ మెక్కుడుగనుక?

యుధి—దేవీ! నీమీఁద నెంతప్రేమ మెక్కుడుగనున్నను మన మిరువురమును గలిసియే పోయిన నాహృదయముఁగూడ సంతసించఁ గలదు. బుద్ధిమతికా! నీవు ముందుగఁబోయి యింతయుదకంబును దెమ్ము?

చేటి (తెచ్చియిచ్చును)

యుధి—దేవీ! మనమీచితినిఁ బ్రవేశించుటకు ముందుగా లోకాచార మతిక్రమించుట దోషంబుగాన నుదకక్రియఁ గావించుదము. కాన నీవునుగూడ నీప్రేమికుడిని వెలఁబుచ్చుకొనుచు భీమార్జునులకిన్ని నీళ్ళను వదలుము?

ద్రౌప—చితినిఁబ్రవేశించుచున్న దానను. నేనువిడిచిన నేమి? విడకున్న నేమి? నాబిడ్డలుగఁగూడ మీరేవిడువుఁడు?

యుధి—(శుభ్రముగాఁ గాళ్లనుగడిగికొని యాచమనముఁగావిం
చి ప్రాచీనావీతియై) ఏషతావత్సలిలాంజలిర్గాంగేయాయ, భీష్మాయ,
గురవే, ప్రపితామహాయ, శాంతనవాయ; అయమపిపితామహాయ, విచి
త్రవీర్యాయ (కన్నీళ్ళతో) ఇఁకఁదండ్రిగారిది గాఁబోలు వంతు. అయమ
పితత్రభవతే, స్వర్గస్థాయ, గురవే సుగృహీతనామ్నే పిత్రే పాండవే.

సీ. ఇదియెతుదిసారి విడచుట నేనునీళ్ళు
సంభవించ దిఁకెన్నఁడు జనక నీకు
నేనుగన్నీటితోనిచ్చు నీటినాబ
కాదఁ గ్రోలఁగ వేఁడుచు న్నాఁడనన్ను.

గీ. నేనువిడచుచున్న నీరంబుఁదమ్ముఁడా
యుద్ధఱకునుగాన నీవుకుంధు
దప్పిఁగొంటినంచు ద్రాగఁబోకయ్యె నిన్
గలియ నేనువత్తు క్షణమునందె.

తమ్ముఁడా! వెంగలినై యిటులంటిని. రణరంగమున నుడసి వీరస్వర్గమలం
కరించిన నిన్ను నేనాత్మహత్యతోడఁ గలిసికొనఁగలనా? కష్టముకష్టము.
కాని సోదరా! వాయునందనా!

సీ. ఏను గుడిచినపిమ్మట నేగదాన
సోదరా! యిమ్మకడఁ గుఱ్ఱు చుందువీవు
పాలఁట్టులే మందువెనకల బ్రాణములను
బాయకుండ ముందుగఁబాయఁ బాడియయ్యె.

ప్రేయసీ! నీవుఁగూడ నామాటవిని యిన్ని నీళ్ళు వదలుము?

ద్రౌప—నాథా! ఎవరికొఱకు వదలవలయును?

యుధి—ప్రేయసీ! ఎవరికొఱకు విడువవలయునో తెలియనే
లేదా? ఏవీరుండు వీరమాతయగు కుంతీదేవికడుపునఁ జిచ్చువెట్టెముం

దుగా స్వర్గమునలంకరించెదనో నాసికొఱకే. (అని చేతిలో నీరముఁబోయుచుండ ద్రౌపది కన్నీటితో వదలుచున్నయది.)

యుధి — తమ్ముఁడా! భీమసేనా! ప్రతిజ్ఞానిర్వాహణభారము నీయందున్నను దానిని నెఱవేర్చుకొనలేక పోయితివి గదా? యన్న విచారముచేతఁ గనులవెంట వెడలునీళ్ళతో నీకాంత తన ప్రేమమును జూపుచున్నయది. నీవన్యథా తలంపకుందువనియు, నీకీవిరియఁబోసియున్న కురులే జ్ఞాపకముఁ దెచ్చుచుండునుగదాయని యట్టులొనర్చుచున్నయది.

ద్రౌప — నాథా! మనమాలసించినకొలఁదియు భీమనందనుండు దూరమునకుఁ బోఁగలఁడు. కాన వైళంబ లెండు. చితియును నతితీక్ష్ణంబుగఁ బ్రజ్వలించుచు మనకుస్వాగత మిచ్చుచున్నది.

యుధి — దేవీ! అవును. అంతియగాక?

గీ. ధర్మజా! గలియుదువీవు త్వరితముగ న
యనుచుఁ దెల్పుచుఁ గుడికన్ను అదరసాగ
చేరితిరద మనభీమ సేనునంచు
శాంతిఁ జెందెదనింక నా స్వాంతమందు.

(తెఱలో)

మహారాజా! రక్షింపుఁడు. రక్షింపుఁడు. భీమునివధించి ఆనెత్తురుగుడ్డలతో పాంచాలియేది? పాంచాలియేదియని వెదకుచు పాపాత్ముఁడగు దుర్యోధనుఁడు వచ్చుచున్నాఁడు. మహారాజా! రక్షింపుము.

యుధి — హా! దైవమా! (అనిమూర్ఛిల్లుచున్నాఁడు.)

ద్రౌప — హా! కృష్ణా! ఆపద్బాంధవా! ఇఁక నీ వేదిక్కు.

(అనిమూర్ఛిల్లుచున్నది.)

యుధి — (లేచి) హా! తమ్ముఁడా! అర్జునా! ఇప్పుడు నీకొఱకుఁ గూడ నేడువవలసి వచ్చినదా? హా! సవ్యసాచీ!

గీ. ఎంతటియదృష్టవంతుఁడ వీవు నేను
పాపుఁడనుగద తమ్ముఁడా! పార్థ! లేక
యున్న నిచ్చోటనే గూరు చుండియెన్చు
వాఁడనే రణముఖంబునఁ బాదమిడక.

ద్రౌప—(లేచి) హా! ప్రాణేశ్వరా!

గీ. ఎంతయోకష్టపడి గ్రహి యించినన్ను
యింతదాకను భరియించి యిపుడునన్ను
దిక్కు లేకుండఁజేసి యీ తీరునఁ బ్రియ
సోదరునిఁ జూడఁబోతివే సుందరాంగ.

ఓద్రోణాచార్యప్రియశిష్య !

గీ. కురుకులము నాశొనర్చిన ఘోరమే ప
రాభవముఁదీర్చి మీదు వి క్రమముఁ జాటి
ఖ్యాతిఁగాంచెద రనుకొంటిఁ గాని యింత
దారుణము సంభవించుటఁ దలఁపనైతి.

(తెఱలో)

ఓశమంతపంచక సంచారులారా ! నాయీభీకరరూపమునుగాంచి పరుగిడకుఁడు. ద్రౌపదియెందున్నదో తెలియఁబలుకుఁడు !

గీ. కురులఁబట్టి యీడ్పించుచుఁ గోకలనొలి
పించుచు సుయోధనునిచేత వెఱపు లేని
కాఱుమాటలాడించుచు కలతపడిన
మనసుతోనున్న ద్రౌపదిన్ గనఁగవలయు.

ద్రౌప—ఓ ద్రౌపదీ! ఇంక నీకీ నీచపుబ్రతుకుపై నేటియాస? నీజీవితమంతయు నీవిధమగు పరాభవములతోడనే గడుపుకొనవలయునా?

ఆయ్యో! నాథా! దుర్యోధనుఁడు దుర్యోధనుఁడు. నాకింకేమిగతి? (అని ధర్మరాజును గౌఁగిలించుకొనును)

యుధి—దేవీ! జడియకు. ఓరీ! ఎవఁడురా! అక్కడ, నాకిల్లు నిటు తెమ్ము?

కంచు—చిత్తము (అనినిష్క్రమించుచున్నాఁడు)

యుధి—ఓరీ! దురాత్మా! దుర్యోధనహతక! నేటితో నీయాయువు నిండుచున్నది. రమ్ము. రమ్ము. కురుకులాంగార! వరుసఁగా నిరువురుసోదరులను బొట్టఁబెట్టుకొని తాయిన్నె మొండిజీవితమును గన్నుచున్న నేను ...సమడంపఁ జాలనని తలఁచుచుంటివి గాఁబోలు?

(అప్పుడు వికృతాకారముతో భీముఁడు ప్రవేశించుచున్నాఁడు.)

భీము—ఓహో! మీాయందఱికీ భయమేటికి? రాక్షసుఁడఁగాను. భూతమునుగాను, మానవుఁడనే. క్షత్రియకులోద్భవుఁడను. వీరపురుషోచితాకారమును దాల్చినవాఁడను. శాత్రవుసిరక్తముచే నభిషేకింపఁబడినవాఁడను. ద్రౌపది యేది? ద్రౌపది యేది?

ద్రౌ—(భయపడి పరుగెత్తుచుండఁ గురులడ్డంబగుటచేఁదడఁబడుచున్నది.)

కంచు—అమ్మా! నీకురులను ముడివైచుకొని త్వరితంబుగఁబతి కడకుం జేరుము?

యుధి—ఛీ! ఎవఁడురా! దురాలోచనముఁ జేయుచున్నాఁడు? దేవీ! పాంచాలరాజపుత్రీ! వలదు. కురులముడువ వలదు.

భీము—ఓద్రౌపదీ!

గీ॰ ఇతఁడు జీవించియుండఁగా ॥ నేన వైరి
చిక్కువఱచిన కురులనీ ॥ చేతితోడ
ముడినివైచుట న్యాయముగా ॥ ముడిని వైవ
వచ్చినాఁడను నిలఁబడు ॥ పాఱిపోకు.

ద్రౌప—(ఆతురముతో) నాథా! రక్షింపుము. రక్షింపుము.

భీము—పాంచాలీ! నిలుపుము. నిలుపుము. (అని కేశపాశమును ముట్టనుంకించు)

యుధి—[భీమునిగట్టిగాఁ బట్టుకొని] ఓరీ! దుర్యోధనా?

గీ. చిక్కితివి యొందుఁబోయెదు ? చెనటి! నీవు
మాకొనర్చిన కీడుల ? మాటమఱువ
నైతినవియన్ని నేటితో ? నంతరించు
లోకమా శాంతిఁజెందు ఖ ? లుండ! యింక.

భీము—(తనలో) నేనుదుర్యోధనుఁడనని కాఁబోలు వీనియభి ప్రాయము. అన్నా! ధర్మనందనా! రక్షింపుము.

గీ. నందిటఁబట్టి యదుముట ? సర్వకల్య
ములును చూర్ణంబయొడిజీవ ? ములనునిల్పు
మయ్య పాంచాలికురులతో ? నయ్యనాకు
చాలపని యున్నదయ్య దో ? స్సారమూర్తి.

కంచు—(చూచిబోల్చి) అయ్యా! ధర్మనందనా! దుర్యోధనుఁడు కాఁడు. మనభీమసేన కుమారుఁడు. భీమసేన కుమారుఁడు. శాత్రవుని రక్తమంతయుఁ జంతనమురీతి నొడలంతయుఁ బూయఁబడి యుండుటచే నానవాలుబట్టుట కఠిన్యముగా నున్నయది. మహారాజా! అనుమానింప నక్కఱలేదు.

యుధి—ఓయీ! కంచుకీ! ఏమంటివి? దుర్యోధనహంతకుఁడు గాఁడా? మః భీమసేనుఁడేనా? నాప్రియసహోదరుఁడేనా? ఈరక్తమం తయు నాదుర్యోధనుని దేనా? సరిగాబొగనునుచూచి చెప్పుము?

భీము—మహారాజా! మీకీయనుమానమెందులకు? ఇంకను దు ర్యోధన హంతకుఁడెక్కడ? తాము శాంతి వహించి నన్నువదలి నాఁ జెప్ప మనవినింత యాలింపుఁడు?

యుధి—(విడిచిచూచి కన్నీళ్ళుదుడుచుకొనుచున్నాఁడు)

భీము—అన్నా! ధర్మనందనా! ఈదేహమింతబాధ నెప్పుడును పొందియుండలేదుగదా? అందుకే కాఁబోలు;

గీ. అలఁగులెఱుఁగని ధర్మజుఁ డలిగెనేని
సాగరములన్ని యొకచోట సంభవించు.

నని పెద్దలు వక్కాణింతురు. దేవా! ముందువిజయలక్ష్మినివెంటఁదోడ్కొనివచ్చిన యీభీమసేనుని మ్రొక్కులందుకొనుము?

(అనినమస్కరించుచున్నాఁడు.)

యుధి—చిరాయుష్మాన్భవ. తమ్ముఁడా! నీవువచ్చునరికి నేను బాష్పజలపూరితలోచనుండనై యుంటిని. అందుచే నిన్నుఁబోల్పలేకపోతిని. అన్యథాతలంపకుము. సోదరా! తమ్మునితోఁగూడనీకుఁగుశలమా?

భీము—జగదేకవిక్రమాఢ్యులగు దేవరవారి సోదరులమై యుండి పరాజయమునుఁ బొందెదమా? తమకీర్తికిఁగళంకమాపాదించెదమా?

యుధి.—(ప్రేమతోఁ గౌఁగిలించుకొని) శత్రుసంహారమునుగూర్చినవివరముల నావల ముచ్చటించుకొందము. కాని బకుని, కిమ్మీరుని హిడింబాసురుని, కీచకుని, దుశ్శాసనుని సంహరించిన భీముఁడవు నీవేనా? తమ్ముఁడా!

భీము—అన్నగారూ! ఆదురాత్ముల నందఱిని సంహరించినవాఁడను నేనే. కాని, ధర్మనందనా! ఒక్కముహూర్తమాత్రమునన్ను విడిచిపెట్టుఁడు?

యుధి—తమ్ముఁడా! ప్రేమముచేతఁ గౌఁగిలించుకొంటిని. కాని యింక ననుమానముఁ గలిగెగాదు. (అని విడచుచున్నాఁడు)

భీము—అన్నయ్యా! శత్రువధమూలమునఁ దడిసిన యీనెత్తుట

చేతులచేత ద్రౌపదీదేవికురులను ముడిచిరా హృదయము తత్తఱప డుచున్నయది. అనుజ్ఞనీయుఁడు ?

యుధి—అది గోప్యయవశిష్టముగనే యున్నది. త్వరితంబుగఁ బొమ్ము. ఎంతయో కాలమునుండి పరిభవక్లేశ మనుభవించుచుండిన పాంచాలి నేఁడు వేణీసంహారమహోత్సవానందముతో ననుభవిం చుఁగాక ?

భీము—దేవీ! ద్రుపదరాజనందనీ! నీవునేటితో ధన్యురాలవై తివిరమ్ము ?

గీ. రిపుకులక్షయమును బొనరించినట్టి
నెత్రుచేతులతోడను నీకురులను
ముడుచువాఁడను నీకుఁబ్రమోదమెంతో
కలుగఁజేసెడివాఁడనో కలికిరమ్ము.

ద్రౌప—(భయకంపితయగుచు నెమ్మదిగా సమీపించుచున్నది)

భీము—దేవి! నేను పరుఁడనుగాను. భయపడెదవేల? చూఁడు?

గీ. ముందలనె బట్టియీడ్చి నీ పుట్టములనె
వందునొలిచెను వాని; నవ్వేఁడుతోడపయిఁ
జేసెనో నన్నుఁగూర్చుండఁ జెలియవానిఁ
గూల్చివచ్చినవాఁడ వృకోదరుండ.

బుద్ధిమతికా! భానుమతి యిప్పుడెందుండును ?

చేటి—శృంగారభవనంబున.

భీము—ఏమిచేయుచుండును ?

చేటి—ముడి విడిపోవలసివచ్చినందులకు నేడ్చుచుండును.

భీము—దేవీ! పాంచాలీ!

ఉ. కూళలఁ గౌరవాధములఁ గూల్చెడిదాకను గర్వియౌచుఁ బాం
చాలిని దాసివంచు విరసంబులనాడిన రాణినూకుఁ బాం

చాలికదాసివై దప్పరుగ నంతసమచ్చెడిదాక నిద్రం బో
జాలని భీమసేనుకులి గౌరవదీనాంతి వహింపనేర్చునే.

యనినేను నాఁడనినమాట జ్ఞప్తియందున్నదా? పాంచాలికురులు ముడి వడినవి. నీవురులే సెలవు బుచ్చుకొనినవి. ఇంకవచ్చి దాసివైయుండు మని తెలియఁజేయుము ?

యుధి—తమ్ముఁడా! ఇదినమయముగా దూరకుండుము. కార్యో న్ముఖుఁడవుగమ్ము.

భీము—(నెత్తురుచేతులతో ద్రౌపదీదేవి వేణిముడుచుచు) దేవి! ప్రతిజ్ఞా పూర్తియైనదా ?

(తెరలో)

లోకకళ్యాణ మగుఁగాక; లోకకళ్యాణమగుఁగాక; పాంచాలరాజపుత్రి! ధన్యురాలవైతివి.

యుధి—తమ్ముఁడా! శ్రీకృష్ణార్జును లిరువురును యిటవచ్చుచు న్నారు చూచుము ?

భీము—అవును! అన్నయ్యా! వారే

(కృష్ణార్జునులు ప్రవేశించుచున్నారు.)

యుధి—దేవా! నమస్కరించుచున్నాఁడ. తమ్ముఁడా! రమ్ము ఒకసారి నాకు గాఢాలింగనమిమ్ము. (అని కౌఁగిలించుకొనుచున్నాఁడు)

కృష్ణు—ధర్మనందనా ! చార్వాకుని మోసమును దెలిసికొని బిరబిరఁ బయిువెత్తుకొనివచ్చితిమి.

యుధి—ఈమోసమంతయుఁ జార్వాకుఁడే యొనర్చెనా? ఎవఁ డురా! అక్కడ: విల్లుఁదెమ్ము ?

కంచు—చిత్తము (అనివెళ్లుచుండ)

కృష్ణు—నకులునిచేఁజిక్కి సంహరింపఁబడిన వానికొఱకుమీరు చేయి చేసికొనసక్కఱలేదు. కాని ధర్మనందనా! కావలసిన పనుల

స్తైనది. విజయలక్ష్మి వచ్చి నీభుజదండను వసించియున్నది. హామెను చేబట్టుచుండఁ జూడవలయునని మాని చంద్రులెంద యున్నారు. కావనింకఁ బట్టాభిషేక మహోత్సవ మొన రండు.

ధర్మ—శ్రీకృష్ణభగవానుఁడా! నీవు స్వయంబుగా సూత్రధా వై యీనాటకంబంతయు నడుప నే కార్యములు నెఱవేఱకుండును! ! నీయాజ్ఞకు మేలుగలదే! నీకృపాదృష్టి మాపైనఁ బఱపుచున్నం లహా మాకేకొరవయుఁ గలుగనేరదు. పట్టాభిషేకమున కేమి! జ్ఞానుసారముట్టులనే గానీయవచ్చును. కాని నేఁడు మామొదలఁ న్నుదవైతివిగాన;

నీతిన్ జాతిని వీడకుండఁ బ్రజలెం తే శ్రద్ధతో మెల్లఁగా
పాతివ్రత్యము నిల్పుకొంచుఁదగు సౌ భాగ్యంబులన్ బొందుచున్
నాతుల్ మెల్లఁగ భారతాంబకునునం తా! శాంతినిన్ గొల్పుచున్
జేతో మోదముఁ గూర్చులాగునను హా శీర్వాదమున్ జేయవే.

కృష్ణు—తథాస్తు. అందఱు (నిష్క్రమించుచున్నారు)

గద్య.

ఇది శ్రీదుర్గానాగేశ్వర వరప్రసాదలబ్ధ సరసకవితాధురం
ధరకొండాలి సాధుసంశ క్షీరనీరాకర రాకాసుధాకర
నారపరాజామాత్యపౌత్రగౌతమసగోత్రపవి
త్ర గుణకదంబ మహాలక్ష్మీగర్భశుక్తి
ముక్తాఫల వేంకటహనుమంతరాయ
తృతీయ తనూభవ సత్యనారా
యణ నామధేయప్రణీతం
బగు వేణీసంహార
నాటకంబునందు
సర్వంబును
— సంపూర్ణము —

# అడ్వర్ టైజుమెంటు

# అం తా యిం తే

———— ):o:( ————

నవల కాదు. నాటకము కాదు. పురాణముగాధ కాదు. చిత్రకముగాదు. అంకములు లేవు. రంగములు లేవు. అధ్యాయములు ప్రకరణములు లేవు. పొడుగుగా యొకటే సొద చదువ చదువ రుచి పుట్టించజేసి అవసరంబుల నొలికించుచుఁ బూర్తిగా చదువన నిద్రాహారముల మఱపించును. డెమ్మిసైజున 200 పుటలుండును. రూపాయిమాత్రమే. సాంఘిక దురాచార బహిష్కారవాదులు దీని వ్రాతప్రతినిజూచి సెబాసని మెప్పుకొండిచ్చిరి. త్వరలో వెలగలదు. కాన వెంటనే తమ పేర్లను రిజిష్టరు చేయించుకొనుఁడు.

గ్రాహ్యము:—

వలయువారు:—

కొడాలి సత్యనారాయణరావు.

హనుమంతవిలాస్

శనివారపుపేట, ఏలూరు తాలూకా.

అనివార్యమువలయును:—

